# మృచ్ఛకటికము




ప్రబంధ కథలు

# మృచ్ఛకటికము

అనుసరణ

తర్కాచార్య, భాషాప్రవీణ

శ్రీ కంభంపాటి గోపాలకృష్ణమూర్తి

ప్రకాశకులు

ఉమా పబ్లిషర్సు

విజయవాడ-1

# పరిచయము

మృచ్ఛకటికము సంస్కృత ప్రకరణము. ఇందు పది అంకములు కలవు. కాని విష్కంభక ప్రవేశకాదులు లేవు. ప్రకరణము దశవిధ రూపములలో నొక రకము. దీనిని సంస్కృతమున శూద్రకుడను రాజకవి రచించెను. ఇతడు శా.శ. 400 ప్రాంతమున ఉజ్జయిని నేలి యుండవచ్చునని, వేదశాస్త్రములను, అస్త్రశస్త్రాది క్షాత్ర విద్యలను పఠించి యుద్ధనిపుణుడైన బ్రాహ్మణరాజనియు చారిత్రకారులు చెప్పుదురు.

రచన చాల సొగసైనది. భాసుని 'చారుదత్త' నాటకము ననుసరించి విస్తరముగా వ్రాయబడినది. ఇది చక్కని సాంఘిక నాటకము. ఇందన్ని పాత్రలును ఆదర్శప్రాయములే. దరిద్ర చారుదత్తుడు నాయకుడు. వసంతసేన సుగుణవతియైన వేశ్య నాయిక. వేశ్యమాతకూడ మంచిదై యుండుట యిందలి ప్రత్యేకత. కన్నములు వేయుటలోని నాగరకత, రాజుగారి బావమరదియాడెడి వికట సంభాషణయు హృదయంగమము.

దీనిని నేను తెనుగున కథారూపమున మూలరసమునకు భంగము కల్గకుండ, ఓపినకొలది సంతరించితి. దీని జదివి విద్యార్థులు మూలాస్వాదనాభిరక్తు లగుదురుగాక! విద్యాధికులీ నాకృషికి జేదోడునిత్తురని ప్రార్థించుచున్నాడ.

శా.శ. 1880 వైశాఖము 19
విజయవాడ-2

ఇట్లు
రచయిత.

# ఇందలి పాత్రలు

* చారుదత్తుడు = నాయకుడు
* మైత్రేయుడు = విదూషకుడు
* శకారుడు = రాజుగారి బావమరది
* వర్ధమానకుడు = చారుదత్తుని బండివాడు
* శర్విలకుడు = మదనికను ప్రేమించిన దొంగ
* రోహసేనుడు = చారుదత్తుని కొడుకు
* స్థావరకుడు = శకారుని బండివాడు
* ఆర్యకుడు = గోపాల బాలకుడు (క్రొత్తరాజు)
* వసంతసేన = నాయిక (వేశ్య)
* మదనిక = నాయిక దాసి
* ధూతాదేవి = చారుదత్తుని భార్య
* రదనిక = చారుదత్తుని దాసి

ఇంకను న్యాయాధిపతి మున్నగువారు.



# మృచ్ఛకటికము

భారతభూమిలో పుణ్యాత్ములలో వచ్చిన అమరావతి వలె సకల సంపదలకు పుట్టినిల్లైన 'ఉజ్జయిని' యను నగర మున్నది. అందు మహాధనికుడైన బ్రాహ్మణు డొకడుండెను. అతని పేరు చారుదత్తుడు. అతడు సుగుణములరాశి. వ్యాపారము చేయువాడగుటచే అతడు శ్రేష్ఠుల వీధినే యుండెను. అడిగిన వారికెల్ల లేదనకుండ దానము చేయుటచే అతని సంపద నామమాత్రా వశిష్టమైనది. కాని ఇంగువ కట్టినగుడ్డ అన్నట్లు కీర్తి అతనిని వదలలేదు. ఆయూర నతనిని నెరుగని వారు లేరు. అతనికి మైత్రేయుడను బ్రహ్మచారి యొక్కడు ముఖ్య మిత్రుడు. సంపద కల్గిన రోజులలోనున్న దాసదాసీ వర్గములో వర్ధమానుడను బండితోలువాడును, రదనికయను దాసియు నతని వదలలేక తినియో తినకో అతని యింటి వద్దనే యుండిరి. దరిద్రముతోపాటు సంతానముకూడ అతనికి హెచ్చినది.

మైత్రేయుడు వారి యింటివద్దనే యెప్పుడు భుజించువాడు. అతని కదితప్ప 'నా' అన్న యిల్లు లేదుకదా! 'ఊర ఆంబోతువలె తెగతిని హాయిగా నొరలినంతసేపు [illegible]

వీధుల వెంబడి తిరుగువాడు. కాని సంపద తగ్గుటతో తనకే లేని చారుదత్తు డితనికికూడ తిండి యెట్లు పెట్టగలడు! తిండికై వేరు ప్రదేశము వెదకికొనవలసిన అవసర మతనికి పట్టినది. ఇంతవరకు అలవాటులేని పని యీరోజున ఎట్లు చేయగలడు! అయినను తప్పని సరియై ఆరోజు చూర్ణవృద్ధుడను చారుదత్తుని స్నేహితునింటికి భోజనమున కేగెను. అతడు భోజనమైన వెనుక జాజిపూవుల వాసనలు వెదజల్లు పట్టు కండువానిచ్చి 'పూజయైన తర్వాత దీనిని చారుదత్తున కిమ్మ'ని చెప్పి పంపెను. మైత్రేయు డలవాటుచొప్పున తిండి మరొకచోట తిన్నను పరుండుట కిక్కడికే వచ్చుచుండెను.

అప్పటికి సాయంకాలమైనది. గృహదేవతా పూజలైనవి. గ్రామ దేవతకు బలుల నిచ్చుటకై చారుదత్తుడు వీధిలోనికి దాసితోకూడ వచ్చెను. అప్పుడే మైత్రేయుడు వెళ్లెను. అతని జూచుటతో చిరకాలమునకు చూచినట్లు కౌగిలించుకొని క్షేమ మడిగెను. అతడు చూర్ణవృద్ధుడిచ్చిన యుత్తరీయము నిచ్చెను. అతని దిచ్చినచేయి కాని పుచ్చుకొన్న చేయికాదు. దానితో అతనికెంతో విచారము కల్గినది. అతని విచారమెంత బరువైనదో మైత్రేయున కేమి తెలియును! 'మిత్రమా! కష్టపడి సుఖించినచో చీకటిలో నుండి వచ్చి దీపమును చూచినట్లుండును. కాని సుఖపడిన తర్వాత కష్టపడుట బహు భారముసుమా! దరిద్రముకంటె మరణమే మేలు. మరణము వలన అప్పటికప్పుడు కష్టము కల్గునేమో కాని దరిద్ర మున్నన్నినాళ్లు బాధించును. నాకు

పోయిన ధనమునకై విచారములేదు; కాని మదములేనప్పుడు తుమ్మెద లేనుగును విడుచునట్లు నాయింటి నతిథులు వదలి వేసిరే అనియే నా విచారము. బ్రతికిచెడి నందులకు నాకు విచారము లేదు. సంపదలు వచ్చుచు పోవుచుండును. కాని ఆప్తులైన మిత్రులు వదలిపోదురే అని దుఃఖించు చుంటిని. కాక మరొక్క విషయము. దారిద్ర్యము వలన సిగ్గు కల్గును. దైన్యము వచ్చును. అవమానము తటస్థించును. బుద్ధి పని చేయదు. సంతోష ముండదు. ఒక్క దరిద్రముతో నెన్ని అనర్థములు వచ్చునో చూడు. బంధుకోటి దూరమగును. ఆరని దుఃఖముగా నుండును. మనస్సులో ప్రవేశించి చంపని విషముకదా దారిద్ర్యము! సరే దానికేమి కాని నాల్గువీధుల మొగలోనికేగి గ్రామదేవతలకు బలివేసి రమ్మ' అనెను.

మైత్రేయుడు 'ఎందుకయ్యా? దేవతలకు బలులు? నీ విన్నాళ్లుగా పూజించుచున్నను వారు కరుణించిరా? మ్రొక్కిన వరమీని వేల్పుల పూజించుట యనవసరము' అనుటతో చారుదత్తుడు 'అట్లనకుము. మనవిధి మనము నిర్వర్తించు కొన్నచో దేవత లనుగ్రహింపక మానరు. దేనికైన సమయము రావలెగదా? బలివేసి రమ్మ'నెను. 'అయ్యా! నన్ను చంపకు! నా రోజులు బాగులేవు. నే నేపని చేసినను అద్దములో నీడవలె తలక్రిందుగా పరిణమించు చున్నది. ఇది సాయంకాలము. ఈ నగరిలో వేశ్యలు హెచ్చు. కామినులకై వెనకు కాముకులు మతిభ్రమ కల్గి నన్నేమి పట్టుకొందురో? నాకెందుకు వచ్చిన గొడవ? మహా

కరి నెవరినైనను పంపుము' అని వారిద్దరును వాదులాడు చుండిరి.

అనుకొన్నంత జరుగుచున్నది. రాజుగారి యుంపుడు కత్తె తమ్ముడు శకారుడను మూర్ఖుడొక డున్నాడు. వానికి రాజుగారి బావమరదిని గదా అని గర్వము. కంటపడిన వేశ్యను పోనియ్యడు. అతనికి స్నేహితులు విటుడు, చేటుడు అను భోగపువాడలో పరిచయము కల వ్యక్తులు. అతని కనొక రోజున వసంతసేనపై బడినది. వసంతసేన మంచి అందగత్తె. చదువులో కాని, అందములో కాని, మంచితనములో కాని ఆమెకు సాటివాగల వేశ్య ఆయూర లేదు. అందుచే ఆమెను వలవని పురుషుడు లేడనవచ్చును; కాని వారు వలచిన సరియా? ఆమెకిష్టము కావలదా? ఆమె గుణములను వరించును; కాని కేవలము ధనమును కాదు. ఆమె యొకనాడు మన్మథ దేవాలయోత్సవములలో చారుదత్తుని చూచి తనకభిలాష యున్నట్లు తెల్పినది. కాని అతనికే చేత కాని దైనలేకుండ వెలయాలితో పోవుట సిగ్గనిపించినది. బ్రతికిచెడిన వాడుకాని చెడిబ్రతికినవాడు కాడాయె. అయినను ఆమెకు మాత్రమాతని గుణగణములు విని, రూపము చూచిన మీదట వచ్చిన వలపేమో హెచ్చినదేకాని తగ్గ లేదు. అట్టి సుందరిని తన యిష్టము ననుసరించి బలవంత పెట్టబోయినాడీ శకారుడు. వాడు వెనుదగులుటతో లేడి పిల్లవలె రెండడుగులలో దొరకినట్లే దొరకి తప్పించుకొన్నదా తరుణి. ఆమె పరుగెత్తిన కొలది శకారునికి మదనవేదన

హెచ్చుగుచున్నది. 'అబ్బ! నిప్పులలో పడ్డ మాంసమువలె నా హృదయము కామాగ్నిచే తగులపడిపోవు చున్నది. ఆగుము బోగము పిల్లా! ఆగుము' అనుచు వెంటపడినాడా ధూర్తుడు. చేటుడు 'మాదొర అడవి ప్రవేశించిన కోడిపుంజు వలె వచ్చుచుండ, నీవేమో వేసగికి పురివిప్పుకొని పారిపోవు నెమలివలె పారిపోవుచుంటివే!' అన్నాడు. శకారుడు 'ఓసీ పసుపుపిల్లా! నన్నేడిపించెదేటికే? రావణాసురుని చేతులలో పడిన కోతివలె పారిపోవ జూచుచుంటివే' అన్నాడు. అతని మాటలంతే. సందర్భము లతనికి తెలియనే తెలియవు: విటుడామెతో 'నీవు పరుగెత్తినను లాభములేదు. మేము గాలిని కూడ పట్టగలము' అనుటతో శకారుడు 'బావా! దీనిని పొగడుమందువా? ఆగునేమో? 'ఓసీ! డబ్బులాగుదానా! ఆటలాడుదానా! చప్పిడి ముక్కుదానా! బోగపు రాణీ! నన్ను కన్నెత్తిచూడవే నా ప్రాణప్రియా!' ఏమని పొగడినను ఇది చూడదేమి బావా?' అన్నాడు. ఆమె కీతని మాటలు వినపడలేదనుకొనరాదు. చెవులపడినందుననే మరింత జంకినది. ఉరుమువిని హంస జంకినట్లు, విటులు గోటమీటిన వీణె తీగెలు జంకునట్లు జంకినది.

అప్పటికి చీకటి క్రమ్మినది. చీకటి కామినీ కాముకులకు సిద్ధాంజనము కదా! వారికప్పుడు లోంగనివారిని లోంగ దీసికొనుటకు తగిన సమయము. శకారుడు 'ఏమే భామా! గజ్జెల చప్పుడుచేయుచు పోయెదేమే? రామునకు జంకిన ద్రౌపదివలెను పరుగెత్తుచుంటివే? చూడు హనుమంతుడు

విశ్వావసుని చెల్లెలైన సుభద్ర నెత్తికొని పోయినట్లు చంక నిరికించుకొని పోదును' అన్నాడు. ఆమెకు మరింత భయము వేసినది. వేటకుక్కలు తరుముచున్న లేడిపిల్లవలె నైనది. పరభృతికయను చెలికత్తెను పిలిచినది. ఆ కేకవిని మనుష్యులు వచ్చుచున్నారని భయపడినాడు శకారుడు. కాని విటుడు 'ఈమెయే పరిజనమును వెదకుచున్నద'ని చెప్పుటతో అతనికి ధైర్యము వచ్చినది. 'ఓం కేకలు పెట్టుచుంటివే? పెట్టుము. ఒక్క మగవానికి జడియుదును; గాని ఆడు జనమా? వందమందైనను మాకేమియు లెక్కలేదు. నీకు దిక్కున్నచోట చెప్పుకొనుము. దుశ్శాసనుడువలె నేను నీ కొప్పు పట్టగా ఆ జమదగ్ని కొడుకైన భీముడు వచ్చి ఆపగలడా? లేక కుంతీ పుత్రుడైన రావణుడు వచ్చి ఆపగలడా? చూడు. ఇదిగో ఈ వాడికత్తితో నీ మెడ కటుక్కున కత్తిరించి పారవేయుదును' అనుటతో ఆమెకు చాల భయము వేసినది. నిజముగా వాడన్నంతయు చేయువాడే. 'అయ్యా! సేనబలను విడువుమ'న్నది. 'అందుచేతనే చంపక విడిచినాము' అన్నాడు. 'నీకేమి కావలయును?' అని ఆమె అనగా 'నేను వాసుదేవునంత వాడను. నీ వెరుగని దేమున్నది? దేవపురుష మనుష్యుడను. నన్ను కామింపుము! అదేచాలు' అనుటతో 'పాపము; శాంతించుగాక!' అన్నది అతడన్నది పాపపుమాట అనుభావముతో. కాని అతడు మరొకరీతిగా అర్థము చేసికొని 'బావా! ఈమె నన్ను శాంతింపుమనును. నేను పొరుగూరుపోయి అలసివచ్చితి

నను కొన్నదా? ఈమెకు నాపై నెంత ప్రేమయో చూచితివా?' అన్నాడు విటునితో. అతడు లోలోన నవ్వుకొన్నాడు ఇతని తెలివితక్కువకు. ఆమెతో 'నీవొక భోగముది ఇట్ల దగినట్లన లేదు. వేశ్య కెవరైననేమి; విధినిషేధము లున్నవా? నదిలో స్నానముచేయుటకు జాతిభేదమున్నదా? హాయిగా మా దొరను కూడు'మని హెచ్చరించినాడు. ఇప్పటికి వారు చారుదత్తుని యింటి ప్రాంతమునకు వచ్చిరి. అది తెలియును వసంతసేనకు. శకారుడు విటునితో 'బావా! ఈ పాడు దాసీది ఆ దరిద్ర చారుదత్తుని వలచి యిట్లనుచున్నదోయి. వాని కొంప యీ యెడమచేతి నైపుదే. పారిపోవునేమో?' అన్నాడు జాగ్రత్తకై. అదామె కుపయోగించినది. 'చేయి కొరుకునే దొంగవాడు. గట్టిగా పట్టుకొనకే' అన్నాడట ఒక గేహేశూరుడు దొంగనుపట్టిన భార్యతో ఏమున్నది? ఆ దొంగ చేయికొరకి లేచి చక్కాపోయినాడు. అట్లాయిన దిక్కడను. ఆమె మెల్లగా తప్పుకొన్నది. చారుదత్తుని వలచి నందులకు విటుడు మాత్రమానందించినాడు. చీకటి పట్టుగా నున్నందున కన్నులుమూసినను, తెరచినను, లోభి వానికున్న ధనమువలె నిరర్థకమై యున్నది. అతడు విటుని అడిగినాడు 'ఆనవాలు చెప్పు'మని. అతడు 'సువాసన; నగల చప్పుడును ఆనవాల'న్నాడు. ఆమె అదివిన్నది. 'ఓరీ తెలివితక్కువ నాయనమ్మా! ఉపాయము చెప్పిన తర్వాత కూడ నీకు దొరకుదునా?' అని పూలదండలు మెల్లగాతీసి రోడ్డుప్రక్కకు పారవేసినది. అందెలు తీసివేసినది. గోడ పట్టు

కొని తడవుకొనుచు గుమ్మము చేరినది. కాని ఏమిలాభము? తలుపు వేసియున్నది. అదెవరు తీయుదురు? కేకవేసినచో ఇతడు పట్టుకొనునుకదా!, అనుకొన్నంతలో భగవంతుడే ఆమెకు సాయము చేసినాడు.

చారుదత్తుడు గ్రామదేవతలకు నడివీధిలో బలివేయుటకై మిత్రుని వెళ్లుమన్నను వెళ్లనన్నాడు. అప్పుడతనికి విచారము కల్గినది. 'అరే. దరిద్రదశ వచ్చుటతో మిత్రుడైనను మాటవినడు కదా! ఉత్సవములోనికి వెళ్లుటయన్నను సిగ్గుగానే యుండును. దారిద్ర్య మారవపాతక' మనుకొని 'ఓసి దరిద్రదేవతా! నే చనిపోయినప్పు డెవరినావహింతువే?' అని విచారించెను. మైత్రేయునికి ప్రాణము చివుక్కుమన్నది. తానొకందుకు చెప్పిన అతడు మరొకరీతి నర్థముచేసికొని బాధపడెనే? అనుకొని. 'రదనికను తోడంపిన వెళ్లుదు'ననెను. ఆమె అన్నపుపిడత, దీపము పుచ్చుకొన్నది. అతడు తలుపు తెరచినాడు. తలుపు తెరచినందులకు సంతోషించినది; కాని వసంతసేన దీపమున్నందులకు తానెక్కడ శకారునకు కన్పడుదునో అని భయపడి పైటచెరగుతో దీపమార్పివేసినది. మైత్రేయుడు 'రెక్కల తలుపు తెరచినందున జయ్యు'మని గాలి వీచినందున దీపమారిన దనుకొన్నాడు. వెలిగించి తెచ్చుటకై లోనికేగెను.

శకారుడు వసంతసేనను వెదకుచు విటునినే గట్టిగా పట్టుకొని 'దొరికినది. ఇకెక్కడికిపోవుదు?' అన్నాడు. 'ఓయి నేనే' అని విటుడనుటతో వానిని వదలి చేటుని పట్టు

కొన్నాడు. అతడు తన్ను తెల్పుకొనుటతో వారిని చెరొక వైపున నుండుమని మరల వెదకి రదనికను గట్టిగా జుట్టు పట్టు కొన్నాడు. అది 'మొర్రో' అని కేకవేసినది, 'ఎంత మాయలాడివే? అప్పుడే కంఠము మార్చితివే?' అన్నాడు శకారుడు. ఇంతలో దీపము వెలిగించుకొని వచ్చిన మైత్రే యుడు వారినిచూచి దొంగలనుకొని 'అయ్యో! దారిద్ర్యము నకు సాయము దొంగతనము కూడనా?' అనుకొన్నాడు. రదనిక 'అయ్యో! మైత్రేయా! నన్ను రక్షించు' అని కేక వేసినది. 'ఆఁ బలాత్కారమే. ఇదిగో వచ్చుచున్నాను. ఇంటిలో కుక్కకే పౌరుషముండును గదా! నాకాపాటి ధైర్యముండదా?' అని వంకర వెదురు కర్రను పైకెత్తెను. విటుడు 'కొట్టవలద'ని నివారించగా శకారుని మీదికి పోయి 'ఓరీ దురాత్ముడా! దరిద్రుడయ్యెను కదా!' అని మా చారుదత్తు ననవమానింతువటరా? పేదవాడైనంత మాత్రాన పూర్వపు కీర్తిపోవునా?' అని కర్ర నెత్తగా విటుడు 'అయ్యా! ఇతడు మీరనుకొన్నట్లు ద్రోహముచేయు టకు రాలేదు. వసంతసేన యేమో అనుకొని చీకటిలో తెలియనందున ఇట్లు జరిగిన దింతే. మన్నింపుము. చారు దత్తునితో మాత్రము చెప్పకుమ'నుచు బ్రతిమాలి కాళ్లపై బడెను. మైత్రేయుడు చెప్పనని అతనిని లేవదీసెను. అదే మియు శకారునికి నచ్చలేదు. 'వీనికెందుకురా? మనము జడియుట! దరిద్రుడు మనల నేమిచేయగలడు?' అనుటతో

విటుడు 'కాదోయి! మంచు వేసంగి యెండలకింకిన చెరువువలె దానధర్మములతో దరిద్రుడైన చారుదత్తుని గుణములకు జడిసితిని' అనుటతో శకారున కొడలుమండినది. 'ఎవడురా వాడు? ఆ ఘకోటుకింద్రదత్తుడా? రావణుడా? లేక రాముడా కుంతికి పుట్టిన ధర్మరాజా! అశ్వత్థామయా? జటాయువా? శ్వేతకేతువా? పాండవుడా?' అని తననోటికి వచ్చిన పేర్లు ఏకరువు పెట్టినాడు. 'ఓరి తెలివితక్కువ దద్దమ్మా! దీనులపాలిటి కల్పవృక్షమైన చారుదత్తుడురా! ఇక నీకు వసంతసేన దొరకదు లే'. గ్రుడ్డివానికి చూపు, రోగులకు బలము, బద్ధకముకలవారికి కార్యసిద్ధి, మూర్ఖులకు బుద్ధి, వ్యసనము కలవారికి చదువు అబ్బనట్లే నీకిక నిరాశయే' అన్నను మరలునట్లు లేడా శకారుడు. 'ఓరీ కళ్లెము బిగించిన గుఱ్ఱము లొంగును కాని పట్టిలాగిన వచ్చునా? ఆడుది రావలెనన్న మనస్సులో అనురాగము పుట్టవలె; కాని బలాత్కరించిన కార్యసిద్ధియగునా? అన్నను వినలేదు. విసుగుపుట్టి విటుడు వెళ్లిపోయెను. శకారుడు మైత్రేయునితో "నీ మిత్రునితో 'నే వలచిన వసంతసేన నీయింటిలో దూరినది. దానిని నీవే తెచ్చి నా చేతిలో పెట్టవలెను. లేకున్న శకారులతో విరోధము ముదురునుసుమా! నాకు పగ పుట్టినా? వంకాయ వరుసవలె. ఆవు పేడపూసిన గుమ్మడికాయవలె నెన్నటికిని తగ్గదుసుమా!' అని చెప్పుము. తప్పక చెప్పవలెనుసుమా! లేకున్న తలుపుమధ్య పెట్టి వెలగకాయను నలుగకొట్టినట్లు నీ తలకాయను పటపటలాడింతును' అని

చేటునితోకూడి ఇంటికిపోయెను. మైత్రేయుడు ఈ జరిగిన ఘట్టమును చారుదత్తునితో చెప్పవలదని రదనికను హెచ్చరించెను. ఆమె 'నాకీపాటి తెలియదా? ఏమాటనైనను కడుపులో దాచుకొందును' అనెను.

వసంతసేన లోనికి ప్రవేశించినదికదా! చారుదత్తు డామెను చూచి, చీకటిలో నానవాలు తెలియక రదనికయే అనుకొని, బయటపరున్న రోహసేనునకు చలివేయకుండ లోపల పరుండబెట్టి కప్పుమని తన పైకండువా నిచ్చెను. ఆమె కండువానందుకొన్నది. అది జాజిపువ్వుల పరిమళమును గుబాళించుచున్నది. దరిద్రముచేత అతని యౌవనము వడిమళ్లినట్లు కనపడుచున్నను, ఈ సువాసనతో చిగుర్చుచున్నట్లే ఆమెకు తోచినది. తాను వలచిన పురుషుడు స్వహస్తములతోనిచ్చిన, పై కండువాను తనివితీర వాసన చూచి, పైన కప్పుకొన్నది. చారుదత్తుడు కొడుకును లోనికి త్వరగా తీసికొని వెళ్లుమని కేకవేసెను. ఈమె లోనికి పోకూడదనుకొనుట చెప్పినపని చేయలేదు. పాపము! చారుదత్తున కది అన్యథా భావించుటచే మనస్సునకు బాధ కల్గించినది. అతడు దరిద్రుడైన మూలాన పరిజనముకూడ చెప్పినట్లు వినుటలేదని అన్నాడు. ఇంతలో మైత్రేయుడు లోనికి వచ్చుచు 'అయ్యా! రదనికను కేకవేయుచున్నారే. నా వెనుకనే వచ్చినది' అనుటతో చారుదత్తుడు 'తెలియక పరస్త్రీపై తన వస్త్రమువేసి ఆమె మనసునకు నొప్పి కలిగించితి' ననెను. అప్పుడు మైత్రేయుడు 'ఈమె పరస్త్రీకాదు.

నిన్నువలచి వచ్చిన వసంతసేన' అని ఎరుకపరచెను. అప్పుడు చారుదత్తుడు తనలో 'అయ్యో! పాపము! ఐశ్వర్యమంతయు పోయిన తర్వాత నీమె నన్ను వలచినదే. నాకును ఈమెపై కోరికయున్నది. కాని పేదవాడు కోపమునువలె లోలోపలనే అణచుకొనుచున్నాను' అని అనుకొనుచుండగా మైత్రేయుడు 'మిత్రమా! నీతో శకారుడు కొన్నిమాటలను చెప్పమన్నా' డని అతడన్న మాటలను చెప్పెను. చారుదత్తుడు గంభీర మైనవాడు. అతడు చెప్పినది విని, 'వాడా? తెలివితక్కువ వాడులే' అని నోరు చప్పరించెను. అతడు, దేవతలుకూడ కోరదగిన వసంతసేన, ఎందరు ప్రార్థించినను, ఎంత డబ్బిత్తు మన్ననూ అంగీకరింపనిది, తనను వలచివచ్చినప్పుడు మర్యాద చేయుటపోగా, దాసిగా చూచితినే యని బాధపడి, ఆ బాధను పైకి తెలియనీయక, 'వసంతసేనా! నీకు తెలియక పని పురమాయించితిని. ఏమియు యనుకొనకు' మని బ్రతి మాలుకొనెను. ఆమె ఇంతకన్న గడుసుది. 'అయ్యో! మీరే నన్ను క్షమింపవలెను. మీవంటి పెద్దలవద్దకు సింగారించు కొనకుండ రావలసివచ్చినది' అని నమస్కరించినది. వారిద్ద రిలో నెవరు ఎవరిని క్షమింపలేదు. మైత్రేయుడు 'మీరు తగవులాడుకొనక నన్ను క్షమింపుడు' అని తన లొట్టతలను వంచెను. చారుదత్తుడు మెల్లగా నతనిని తప్పించెను.

వసంతసేన కాసమయమున నేమి ప్రస్తావించవలెనో తెలియలేదు. ఏదో మాటాడవలెనని యున్నది. ఏమియు మాటాడకున్న బాగుండదు. అప్పుడామె పని కల్పించుకొని

'ఆర్యా! నా నగను మీవద్ద దాచుము. ఈ చీకటిలో నగయున్నచో నెవరైన వెంటపడవచ్చును' అన్నది. అతడింటి కేసి చూచుచు 'ఈ యింటిలో దాచిన భద్రముగా నుండుననియేనా?' అనెను. ఆమె 'దాచబెట్టువారు వ్యక్తిని చూచి యిత్తురు; కాని యింటినిచూచి కాదు' అని సరసముగా జవాబు చెప్పినది. ఆమె ఏ గుణమును వరించి అతనిని వలచినదో అవసరము వచ్చిన యిప్పుడు ఆ గుణమును పైకి చెప్పకుండ నుండలేకపోయినది. చారుదత్తుడు మైత్రేయుని ఆ నగ పుచ్చుకొమ్మనెను. అతడు పుచ్చుకొని, దానముచేసినదేమో యనుకొని దీవించినాడు. కాని చారుదత్తుడు 'ఇది దాచబెట్టిన సొమ్ము కాని దానమిచ్చిన సొమ్ముకాదు' అని మందలించెను. అతడు 'అట్లైన దొంగలెత్తుకొని పోదురేమో' అని చారుదత్తుని చెవిలోనూదినాడు. చారుదత్తుడు 'ఫరవాలేదులే' అనెను. అంతట వసంతసేన మైత్రేయుని తనకు తోడు పంపుమన్నది. అతడు 'ఈమెతో నాకెందుకు? నీవువెళ్లిన ఇద్దరును హంసల జంటవలె నుందురు' అని ఒక్క-రవ్వ పొగడి, ఆపనిని చారుదత్తునికే అప్పజెప్పెను. అతడు అలవాటు ప్రకారము వర్ధమానకుడను భటుని దీపము తెమ్మనెను. మైత్రేయుడు 'ఇంటిలో నూనె లేదయ్యా! దీపమెట్లు వచ్చును?' అని రహస్యముగా చెప్పుటతో 'పోనీలే. పెద్ద దీపము చంద్రుడే ఉదయించినాడు. ఇక దీపమవసరములేదు' అని వసంతసేనతో కలిసివెళ్లి, ఆమెనింటివద్ద దిగబెట్టి వచ్చెను.

ఆ సువర్ణము నగలను మైత్రేయుని దాచుమని చారు దత్తుడనెను; కాని చదువునకు విఘ్నము కల్గునని అతను రాత్రివేళ మాత్రమే దాచెదనని యొప్పుకొనెను. పగటివేళ ప్రాచీ వర్ధమానకునిది. ఎవరిపని వారు చేసికొనుచుండిరి. కర్మముచాలక వస్తువు పోయిన నామె యేమనుకొనునో అని చారుదత్తుడు భయపడగా; పోయిన బాగుండుననని విదూషకుడు తలచినాడు. ఎవరికోరిక తీరునో?

వసంతసేన, యింటికి వెళ్లినది మొదలు చారుదత్తుని మీది ప్రేమతో అన్నాహారములు హితవులేక యున్నది. ఆమె కెల్లవేళల చారుదత్తుని ధ్యానించుటతో సరిపోవు చున్నది. తనలోతానే ఆలోచించు చుండును. పిలిచిన ఏదియో జవాబిచ్చును. ఆమె తల్లి 'పొద్దుపోయినను భోజ నమునకు లేవవేమి? స్నానముచేసి దేవపూజ చేసికొమ్మని మదనికయను దాసిచే కబురంపినది. ఆమె వచ్చుసరికి పర ధ్యానములో నుండి 'నేను చేయలేనని బ్రాహ్మణునిచే దేవ పూజ చేయించుమను' మన్నది. ఆమె వాలకముచూచి 'నీ దృష్టిపడి ధన్యుడైన ఆ పురుషు డెవడమ్మా!' అన్నది. 'గుణముల వలన ప్రసిద్ధిపొందినవాడు' అన్నది. 'రాజా? రాజోద్యోగియా? విద్యాసంపత్తికల బ్రాహ్మణుడా?' అన్నది మదనిక. అట్టివారెవరును కాకనుటతో మరెవరని అనుమాన ముతో అడుగగా 'ఈ యూరిలో గుణములచే కీర్తిపొందిన వాడెవరే?' అని ప్రశ్నించెను. 'ఆర్య చారుదత్తుడు తప్ప మరెవరున్నారు?' అనుటతో వసంతసేన మొగమంతయు

సన్నులుచేసికొని 'ఆ మహాభాగుడే నా ప్రియుడు' అది విని దాసి 'అతడు దరిద్రుడు కదా!' అని శంకచూపినది. 'అందు చేతనే నేను వలచితిని' అని జవాబు ఉదారముగా వచ్చుటతో 'దరిద్రుడు కన్న నీయింటికే రప్పించుకొన రాదా?' అన్న దామె. 'ఓసి తెలివితక్కువదానా! అతని నిటకు రమ్మన్న నభిమానముతో, ధనములేదని కదా యీమె యిట్లనదగిన దను భావముతో నా పై ప్రేమయే మానును' అని వసంతసేన సర్దినది. అంతటి గభీరభావ మామె కెట్లుకల్గును?

ఇంతలో సంవాహకుడు జూదములో పదికాసు లోడి పోయి, ఇయ్యలేనందున తోటి జూదరులు పట్టుకొందురని పారిపోయెను. అతనిది పాటలీపుత్రము. బ్రాహ్మణుడు. అతడు నేర్చినది పాదసంవాహక విద్య (కాళ్లు పిసుకుట) దైవాద్వా దరిద్రుడై ఇక్కడికి వచ్చి చారుదత్తునివద్ద సేవలు సేయుచుండెను. అతడు నిర్ధనుడై పోషించలేనప్పుడా భటులు మాత్రమెట్లుందురు? అతడు జూదమాడుచు జీవించుచుండెను. జూదములో ఓడిపోయిన అతనిని తక్కినవారు బాధించు చుండ రక్షించువారెవరును లేనందున ఒక పాడుగుడిలోనికి పారిపోయి బొమ్మచాటున దాగెను. అతని వెనువెంటనే తరుముకొని వచ్చిన జూదరులతని వెదకుచు వచ్చిరి. కొంత దూరము వారికతని కాలిగుర్తులు కన్పడినవి. కాని అంతలో అవి మాయమైనవి. ఏమైనవా? అనిచూడగా తలక్రిందుగా కన్పడినవి. 'ఓరి దొంగా! వెనుకనడకను పోయితివా? ఇంత టితో వదలుదుమా?' అని వారు గుడిలోనికేగిరి. అక్కడ

కాలిగుర్తులు కన్పడనందున ఒక్క క్షణము జూదమాడుటకు కూర్చుండిరి. పందెము వేయుసరికి ఒకడోడిపోయెను. అంతట వారిద్దరు 'పందెమునాది, పందెమునాది' అని తగవులాడు చుండిరి. బొమ్మచాటున దాగిన సంవాహకునికి కండూతి ఆగలేదు. ఆ వ్యసనమట్టిది? అతడు కొద్దిక్షణములెట్లో ఆగి నను, ఇక ఆగలేక 'ఓరీ దెబ్బలాడకుడు. నాది పందెము' అనుచు వచ్చెను. వారి కోరిక తీరినది. పారిపోయినవాడు దొరకెగదా అని పట్టుకొని డబ్బిమ్మని పీకజొచ్చిరి. ఈడ్చి తన్నినను కానిలేని అతడు పదిసువర్ణముద్ర లెట్లిచ్చును? ఆ వచ్చిన యిద్దరిలో నొకని కొంత అవకాశ మిప్పింపు మనెను. అతడంగీకరించెను. సగము మానినచో తక్కిన సగమునకు హామీ యిప్పింతుననెను. అతడంగీకరించెను. రెండవవానిని కూడ అట్లే సగము మానుమనెను. అతడును అంగీకరించెను. అప్పుడు 'ఇక వెళ్లుచున్నాను. నీవు సగము మానితివి కదా! తక్కిన సగము నితడు మానెను. ఇప్పుడు మీ బాకీ తీరినదికదా!' అనుటతో ఆ యిద్దరు జూదరులును 'ఓరి దుష్టుడా! నీవే తెలివైనవాడవా? అదా నీయెత్తు? సగము మానినచో తక్కిన సగము నియ్యనక్కర లేదనియా?' అని యిద్దరును కలిసి క్రిందపడవేసి మెత్తగా పది తన్నులు తన్నిరి.

ఇంతలో దర్దురకుడను మరొక జూదగాడు, డబ్బంతయు పోయి పారిపోయినవాడు, చినిగిన కండువా కప్పుకొని అక్కడికి వచ్చెను. అతడు తన మిత్రుడైన సంవాహకునికి

ఇట్టి కష్టము వచ్చినదని అడ్డువచ్చి 'ఓరీ! మీరెక్కడి జూద సలురా? వాడీయవలసిన సొమ్ము తన్నినవచ్చునా? మరి కొంత సొమ్ము అతనికి అప్పిచ్చి, జూదమాడుడు. గెల్చినచో మీ సొమ్ము మీకిచ్చును. గెలువనిచో మీసొమ్ము మీ వద్దకే వచ్చునేకదా!' అని తీర్పుచెప్పెను. వారు వికట ముగా నవ్వుచు, 'అహాహా! ఈపాటి తీర్పరి మాకు దొరక లేదు. వచ్చినదారిన వెళ్లుము. పది సువర్ణములన్ననంత తేలికే. ఇచ్చినగాని వెళ్లనీయము' అని మరల తన్నుచుండిరి. తనయెట్ట యెదుట మిత్రుని తన్నుచుండగా చూడలేక అత డడ్డు వచ్చెను. మధ్యవర్తిగా వచ్చినందుకు అతనికి నాలుగు తగిలినవి. అతడు ఒంట్లో ఓపిక ఉన్నవాడగుటచే నెదురు తిరిగి మరినాలుగు తగిలించెను. అప్పుడా దెబ్బలుతిన్న వాడు 'నన్నన్యాయముగా కొట్టితివే. రాజసభలో రేపేమి చెప్పె దవో చూచెదనులే!' అనెను. దర్దురుడు 'ఎట్లు చూతువు?' అని వికటముగా ప్రశ్నింపగా 'ఇట్లు చూతున'ని రెండు కన్నులు తెరచి చూపెను. ఆ దేసమయమున దర్దురుడు గుప్పెడు మన్నుతీసి వాడి కింటిలోకొట్టి, సంవాహకుని పారి పొమ్మని, తాను వెళ్లిపోయెను.

సంవాహకుడు పరుగెత్తుచు, తలుపు తెరచియున్నం దున వసంతసేన యింటిలోనికి దూరి, 'అమ్మా! శరణు! శరణు! రక్షింపుము' అనెను. ఆమె 'నుకేమియు భయము లేదు. లోపలనుండుము'ని చేటిని తలుపు మూయుమనెను.

'నీకు వచ్చిన భయమేమ'ని అతని నడుగగా, నొక జూదరికి పది సువర్ణముద్రలు బాకీయున్నట్లు చెప్పెను. అదివిని, వసంతసేన అట్లైన తలుపు మూయనక్కరలేదు' అన్నది. అది వినుటతో సంవాహకునికి 'డబ్బుకలది కనుక ఈమెకు అప్పుల వానివలన భయములేదు. తన బలమెరిగి ఉన్నదానికి తగినంత ఖర్చుచేయువానికి ఎప్పుడును ఆపత్తులుండవుకదా!' అనిపించినది. ఇంతలో కన్నులలోపడిన బూడిద దులుపు కొని ఆ జూదరులు ఇతని వెదకొనుచు వచ్చిరి. అతడు లోనికి వెళ్లినట్లు గమనించినను, వారికి లోనికి వెళ్లుటకు ధైర్యము చాలలేదు. బయటనే అతడు వచ్చినచో పట్టుకొందమని కాచియుండిరి.

వసంతసేన సంవాహకుని యోగక్షేమము లడిగినది. అతడు తనయూరు, పేరు చెప్పి, 'మా దేశమున తిండి గడువక ఇక్కడికి వచ్చి, పరోపకారపారీణుడును, తన సంప దలను ఇతరుల కష్టసుఖములకై వినియోగించినవాడును నగు చారుదత్తుని యింట సేవకునిగా నుంటిని. అత డతిదాతృత్వ ముచే దరిద్రుడయ్యెను' అనుటతో నామె 'ఇక చెప్పనక్కర లేదులే. గుణ సంపత్తి, ధనసంపత్తి ఒకచోట నుండవుకదా! త్రాగత్రాగగా చెరువులోని నీరునైత మైపోవును. దానికేమి గాని నీవొక క్షణము విశ్రమింపుమ'ని చేటితో అతనికి వీచుమని ఆజ్ఞాపించినది. అంత సంవాహకుడు తనలో 'చారు దత్తా! నీవు ధన్యుడవోయి! నీ దాసుడనని తెలిసినంతనే ఈమె నాకింత యుపచారము చేయుచున్నది. నీ జీవితము

ధన్యమైనది. తక్కిన ధనికులెల్లరు బ్రతికియు చచ్చినవారే!' అనుకొని, ఆమెతో 'నాకెందుకమ్మా ఈ యుపచారములు. చాలు కూర్చుండుము' అనెను. ఆమె 'పాపము! అట్టి పుణ్యాత్ము లకు సంపదలు నిలువవుకదా!' అని విచార సూచకముగా చెక్కిన చేయిజేర్చి అన్నది. సంవాహకుడు 'అమ్మా! సంపదలన్నవి యెవరికిని శాశ్వతముకావు. సద్వినియోగము చేసినవారికి కీర్తి యొక్కటే దక్కును. ఉన్ననాళ్లితరులకై ధనము వెచ్చించినవాడే తరువాత నితరులచే మన్ననలు పొందును' అనుచు ఆమె విచారమును పోగొట్టెను. ఇంతలో తనకై వెదకుచు వచ్చిన జూదరులనుచూచి, కొంచెముజంకి, సంవాహకుడు 'అరుగో! వారే వచ్చినారు. నన్ను ఎట్లు రక్షింతువో?' అనుటతో నామె చేతి కంకణములుతీసి, దాసి చేతికిచ్చి, వారికిమ్మని పంపెను. వారదిపుచ్చుకొని బాకీ తీరినదని చెప్పి వెళ్లిపోయిరి.

సంవాహకుడు వసంతసేన వద్దనే తాను పనిచేయుదు ననెను. కాని ఆమె 'మీరావిద్య నేర్చినప్పటినుండి యెవని సేవించితిరో వానినే యిప్పుడును సేవించి ధన్యులుకండు' అన్నది. అప్పుడతడు 'ఈమె యెంతనేర్పుగా నన్ను నిరాక రించినది!' అనుకొని 'అమ్మా! నేనిక జూదమాడను. బౌద్ధ సన్యాసినై పోదును. నన్ను మరవకుము' అని వెళ్లి సన్యసించెను.

అతడు వెళ్లిపోవుచుండగా దారిలో వసంతసేన యేనుగు కట్టుతాడూడదీసికొని వీధినిపడి ఎవ్వరికిని లొంగక

జనులను త్రొక్కుచు వెళ్లుచుండెను. దురదృష్టవశాత్తు దాని కెదురు వెళ్లిన బౌద్ధసన్యాసి నాయేనుగు దంతముల సందున ఇరికించుకొని పోవుచుండగా కర్ణపూరకుడను వసంతసేన భటుడెదురువెళ్లి ఇనుపయూచతో దాని మొగముమీద కొట్టెను. ఆదెబ్బకది బాధపడి సన్యాసిని వదలివేసినది. అది చూచి జనులందరు నతనిని కొనియాడిరి. అందొకడు మాత్రము అతనికి బహుమతి నియ్యదలచి, చూచుకొని, తనవద్ద నేమియులేకుండుటచే పైమీది కండువా నిచ్చెను. అది పుచ్చుకొని సంతోషముతో వచ్చి కర్ణపూరకుడు వసంతసేనతో ఆ విషయమునంతను చెప్పెను. ఆ బహుమతినిచ్చిన వ్యక్తి యెవరని తెలిసికొనుటకై ఆ కండువాను వాసన చూచినది. అది తానిదివరలో వాసనచూచినదే. అయినను నిస్సందేహముగ తెలియుటకై పేరుచూచినది. ఒక చివర కుట్టియున్నదా చారుదత్తుని నామము. అదిచూచి యెంతో ఆనందపడి అది తానుపుచ్చుకొని, అతనికి బహుమతిగా రత్నహారమిచ్చినది. 'ఆ మహానుభావు డెక్కడున్నారురా?' అన్నది. 'అదిగో ఈ వీధినే వచ్చుచున్నారు' అనుటతో ఆమె మేడనెక్కి అతనిని రెప్పలార్పక కనుచూపారినంత మేర చూచినది. అతడు వెళ్లిపోయినను ఆమెకు కన్పడుచునే యున్నాడు. ఏ వ్యక్తిని భావించుచుందుమో అది కన్నులకు కట్టినట్లు కన్పడును. దానికి లోకమడ్డురాదు. ఆమె అట్టి భావనాలోకమున తన ప్రియుని చూచుచున్నది.

మధ్యాహ్నము చారుదత్తుడు మైత్రేయునితో కలిసి సంగీతసభ కేగెను. రేభిలుడను గాయకుడు వీణపై సర్వోద్ధాతముగా పాడెను. ఆ పాటలోని స్వారస్యము నాస్వాదించుచు చారుదత్తుడు వెనుకకు రాలేకపోయెను. కాని మైత్రేయున కది రుచింపలేదు. రుచి తెలిసినవానికి కాని లలితకళలు (సంగీతము, కవిత్వము, శిల్పము, చిత్రకళ మున్నగునవి) రుచింపవు. 'అబ్బ! రావోయి! పోదము' అని మాటిమాటికీ పొడిచెను. అతడు 'ఇంత మనోహరమైన పాటవదలి యెట్లు పోదుము? ఉండుము' అని వారించెను. 'ఆఁ చాలబాగున్నదిలే. ఆడుది సంస్కృతము చదువునప్పుడు 'సూసూసూ' అని ముక్కుత్రాడు పోసిన ఆవు వెయ్యవలె మూలిగినట్లు. మగవాడు సంగీతము పాడునప్పుడు మెడనిండ పువ్వుల దండలు వేసికొని వృద్ధపురోహితుడు మంత్రములు చదువునట్లుండును. ఇది నాకేమియు కిట్టదు సుమా!' అనెను. అతని పోరు పడలేక ఆ చక్కని సంగీతమును వినుటమాని చారుదత్తు డిల్లుచేరెను.

ఇంటివద్ద వర్ధమానకుడు రాత్రి ప్రొద్దుపోయినందున మేల్కొనలేక కునుకుచుండెను. 'కలవాడైనంత మాత్రాన సంతోషమందడు. భృత్యులను దయజూచినవాడే సేవింపదగినవాడు. అట్టివాడనేకదా నేనితని సేవించుచుంటిని. పిసినిగొట్టుగానున్న ధనికుని సేవించినమాత్రము లాభమేమి? అబ్బ! ఎంత ప్రొద్దుపోయినను యజమాని రాడేమి? జూదమాడు వ్యసనము కలవారికి వేళ-పాళలు తెలియవు. బ్రహ్మదేవుడు

దిగివచ్చుగాక మాన్పింపలేదు' అనుకొనుచు కూర్చుండియే కునికిపాట్లు పడుచుండెను. అంతలో విదూషకుడు వచ్చి తలుపుతట్టి కేక వేసెను. 'అమ్మయ్య! సగము బరువు తగ్గిన' దనుకొని అతడు తలుపుతీసి చారుదత్తునికి కాళ్లుకడిగి, మైత్రే యునికి కూడ ఆ చేతులతోనే కాళ్లు కడుగబోయెను. 'నా కెందుకులే! కాళ్లు కడిగికొనినైన నేను, దెబ్బలుతిన్న గాడిద వలె భూమిపై పడి దొర్లవలసినదే కదా!' అని నివారించెను. అయినను అతడు వినక బలవంతముగా కాళ్లుకడిగి 'నాయనా! పగలు నానంతుగా నగలను జాగ్రత్తపరచితిని. ఇప్పుడిక నీ వంతు' అని అతని కొప్పజెప్పెను. 'అబ్బ! ఇప్పటివరకు మేల్కొని ఒక్క కునుకుపోవచ్చునన్న ఇదొకటి వచ్చి నా తలపడినది. ఎట్లు భరింతును? ఇంత విశాలమైన యీ విశాలా నగరములో దొంగలే కరవైపోయిరా? ఒక్కడైనను వచ్చి దీని నెత్తుకొని పోరాదా?' అనుకొనుచు, ఇక తనకా పుస్తి ముడుపు తప్పదు దేవుడా?' అనుకొని నడ్డివాల్చెను. చారు దత్తుడును పరుండెను. పరుండిరో లేదో అప్పుడే వారిని నిద్ర ఆవహించినది. దానితోనే కదా మానవులకు పగలెల్లచేసిన శ్రమ తప్పి సుఖము కల్గుట!

ఆ యూరిలో శర్విలకుడను బ్రాహ్మణు డున్నాడు. అతడు చతుర్వేదములతోపాటు కర్ణీసుతశాస్త్రమును (దొంగ తనము) కూడ చదివినాడు. ఆ శాస్త్రమునకు కుమారస్వామి ప్రధానదైవము. కనకశక్తి దీనిపై కొన్ని గ్రంథములను రచించెను. భాస్కరనందియు గ్రంథ రచయితయే. యోగా

చార్యులను సిద్ధుడు సిద్ధాంజనములు వేయుటలో నేర్పరి. అతనివద్ద శర్విలకుడు శుశ్రూష చేసి విద్య నభ్యసించెను. అత డదృశ్యకరణము, ఖని, నిక్షేపాంజనము మున్నగు యోగములు అతనికి చెప్పినాడు. ఆ శర్విలకుడు మదనికను ప్రేమించి, ఆమెను దాస్యమునుండి విడుదల చేయదలచెను. కొంతకాలము విదేశములలో నున్నట్లు, బానిసలను కొను పద్ధతి ఆ కాలమున నున్నదనుకొందును. ఆమెను కొంత డబ్బిచ్చినచో వసంతసేన వదలునని చెప్పగా ఆ ధనమునకై అతడా రాత్రి దొంగతనమునకు బయలుదేరెను. అదృష్టమో? దురదృష్టమో? అతడు చారుదత్తు నింటికే (తెలియక) వచ్చినాడు. ముందుగా ప్రాకారము గోడకు కన్నముచేసి లోనికి వచ్చెను.

అతనికా శాస్త్రములో మంచి ప్రావీణ్యమున్నది. చిన్న కన్నములోనుండి పాముమాదిరి ప్రక్కలు గీసుకొని పోవుచున్నను మెల్లగా దూరి వచ్చినాడు. దొంగతనమునకు భగవంతుడు చేయు సాయమే కటికచీకటి రాత్రి. అంత చీకటిలోనైన నతనికి కన్పడని వస్తువుండదు. గోడ వెదకి నాడు 'ఎక్కడ కన్నము త్రవ్వుట యోగ్యమో?' అని తడిసినచోట, ఎంత త్రవ్వినను చప్పుడుకానిచోట, ఎవ్వరును చూడనిచోట, చౌడుకికినందున తేలికగా త్రవ్వుటకు వీలైన చోట కన్నము పెట్టవలెను. పండుటిటుక లూడదీయవలెను. పచ్చి యిటుకలు పగులగొట్టవలెను. మట్టిగోడలను తడుప వలెను. బల్లకూర్పున్నచో చీల్చవలెను. 'పద్మవ్యాకోశము,

భాస్కరము, బాలచంద్రము, వాడి, విస్తీర్ణము, స్వస్తికము, పూర్ణకుంభము' అని కన్నములలో నేకప్రకారము లున్నవి. అతడు చౌరునికి, ఎలుక కన్నములున్నచోట గోడనుచూచి పూర్ణకుంభమను కన్నము త్రవ్వదలచెను. అది పంచుటికుక గోడకాన మెల్లగా ఇటుకలూడదీసెను. గురువందనముచేసెను. అంతలో కొలతత్రాడు మరచినట్లు గుర్తువచ్చినది. బ్రాహ్మణుడు కదా మెడలో జందెమున్నట్లు గుర్తువచ్చినది. 'ఇది ఎంత ఉపకరించినది. దీనితో తలుపుగడియ లూడదీయవచ్చు; నగల సీలలు త్రిప్పవచ్చు; గోడలకు సొరంగములు త్రవ్వునపుడు కొలుచుకొనవచ్చు; పాముకిషము ఎక్కకుండుటకై కట్టుకట్టవచ్చు' ననుకొని సరిగా కొల్తలు చూచి కన్నము త్రవ్వెను. అతడనుకొన్నట్లే పాముకరచినది. అతడు జందెముతో కట్టుకట్టుకొని మంత్రము వేసికొనెను. విషబాధ తగ్గిపోయినది.

లోపల దీపము మినుకు మినుకు మనుచున్నది. ఆ దీపపు వెల్తురులో ఇద్దరు నిద్రించుచున్నట్లగపడినది. అతడు ముందుగా మాయపురుషుని పంపినాడు. ఎవరును మాట్లాడ లేదు. తాను నిర్భయముగా లోనికేగెను. నిద్రయా? దొంగ నిద్రయా? అని చూచెను. గుర్రుపట్టి నిద్రించుటయు, కన్నులు నిశ్చలముగా మూసికొనుటయు చూడగా అది నిజ నిద్రయనియే అనిపించినది. తలుపులన్నియు తెరచియుంచెను. అందొకటి కిర్రుమనబోయెను. కాని అతడు కొంచెము నీళ్లు పోసి దానిని చప్పుడు కాకుండ తెరచెను. ఇల్లు నలుమూలల

పరీక్షించెను. మద్దెల, వీణ, పిల్లనగ్రోవి, పుస్తకములు నున్నవి. అదిచూచి 'ఇది నాట్యాచార్యుని యిల్లేమో? నా కిక్కడేమి దొరకును? ఇల్లు పెద్దదికదా అనుకొని మోస పోతినే? ఒకవేళ ఇతడు చోరభయముతో భూమిలో పాతె నేమో?' అని విత్తులు మొలవేసి చూచెను. అవి మొలవ లేదు. ఇక అక్కడ పాతు లేదని నిశ్చయించెను. 'వీ డెవడో పరమ దరిద్రుడే. పోయెదన'నుకొనెను.

అంతలో నిద్రించుచున్న విదూషకుడు (మైత్రేయుడు) కలలో 'ఎవడో దొంగ లోనికి ప్రవేశించినాడు. నీ సువర్ణము నీవు పుచ్చుకొనుమ'ని కలవరించెను. తన్ను నిజముగా వాడు చూచెనా? అనుకొని దగ్గరకు పోయి చూచెను. కండువా చివర ముడివేసియున్న నగలను చూచెను. 'ఇంత దరిద్రుని యింట నెందులకు దోచుట? మరొకచోటికి పోయెద' నను కొన్నంతలో 'నీ నగ నీవు పుచ్చుకొనకపోయినచో గోవుల మీద, బ్రాహ్మణులమీద ఒట్టే' అనెను. మైత్రేయుడు. అతడు 'సరే తప్పద'ని ముందుగా మిడతను పంపి దీప మార్పి నగను తీసికొనుటకై చేయిచాపెను. అది చల్లగా తగిలి నిద్రలోనే మైత్రేయుడు 'చేయి చల్లగానున్న దేమి?' అనగా శర్విలకుడు చంకలో పెట్టుకొని వెచ్చచేసికొని నగను పుచ్చుకొని పోవుచుండెను. అంతలో దారిలో రదనిక లేచినది. అది ఆడుదికదా! అని ఆమెను వదలి అతడు పారిపోయెను. అతనికొకరు చూచిరని భయములేదు.

ఉడుమువలె గోడల నెగ్రాకగలడు; కుక్కవలె వంగి పరుగెత్తగలడు; కంఠధ్వని మార్చి నానా భాషలు మాట్లాడగలడు; చచ్చినట్లు పడియుండగలడు; అదృశ్యముగానైన ఉండగలడు. ఇక అతనికి భయమేమున్నది?

రదనికకు ఆ దొంగను చూచుటతో భయమువేసి, 'అమ్మయ్యో! దొంగ! దొంగ! కన్నము త్రవ్వి పారిపోవుచున్నాడు' అని మైత్రేయుని లేపినది. అతడు కన్నులు నులుముకొనుచు, 'ఏమిటే? ఏమిటి? దొంగన్నత్రవ్వి కన్నము పారిపోవుచున్నదా?' అనెను. 'నీ నిద్ర కూలిపోను. ఎప్పుడును వేళాకోళములేనా? చూడుడు. దొంగ యెంతకన్నము త్రవ్వినాడో!' అని రదనిక యనుటతో నతడు పూర్తిగా కన్నులు తెరచి చూచెను. రెండవ ద్వారమంత ఉన్నదా కన్నము. అతడు లేచి చారుదత్తుని లేపెను. అతడు మొదట వేళాకోళమనుకొనెను. కాని తీర చూచుసరికి చక్కగా సొరంగము త్రవ్వబడియున్నది. అతడది చూచి, 'అహోహో! ఈ దొంగ యెంత నేర్పరియో! చక్కగా త్రవ్వినాడు' అని మెచ్చుకొనెను. విదూషకుడు 'ఇతడెవడో పొరుగూరివాడై యుండును. ఈ యూరివాడెవడును మన యింట కన్నము త్రవ్వడు' అని పరిహాసముగాననగా చారుదత్తుడు మనసార బాధపడుచు, 'నిజమే పాపము! ఇంతశ్రమపడి కన్నమువేసి, ఏమియు దొరకలేదని తిట్టుకొనునేమో' అనుటతో విదూషకునకు తాను కలలో చారుదత్తునకు నగలనిచ్చినమాట గుర్తు వచ్చి, 'మిత్రమా! నన్ను ఎప్పుడును తెలివితక్కువవాడనని

తిట్టుచునే యుందువు. ఈవేళ చూచుము. దొంగవచ్చునని తెలిసియే ముందుగానే నగలను నీకిచ్చితిని' అనుటతో చారుదత్తుడు 'ఓరీ మందమతీ! వేళాకోళము కట్టిపెట్టుము' నెను. అతడు నెత్తి, నోరు మోదుకొనుచు, 'నేను నీవన్నట్లు ఎంత మందమతినైనను వేళాకోళము చేయతగిన సమయము నే యెరుగనా? అప్పుడు నీచేయి చల్లగానున్నదే యంటినికూడ. గుర్తుతెచ్చుకొమ్ము' అనెను.

అంతట చారుదత్తుడు నాలుగుమూలలు చూచెను. బిందెలో నీళ్లతో నాగవాసము తడిపినట్లు కన్పించినది. దానితో ఆ చల్లనిచేతులు దొంగవేయని యూహించి, సంతోషముతో 'మిత్రమా! ధన్యుడనైతిని. నా యింటికి వచ్చిన దొంగ ఉత్తచేతులతో పోలేదు. అతడు నన్నిక తిట్టడు' అనెను. అప్పుడు విదూషకుడు 'నాయనా! అది దాచిన సొమ్మోయి' అనుటతో చారుదత్తుడు నిర్ఘాంత పోయెను. లోకము నిజము తెలియక తానే అమ్ముకొన్నట్లు ఏమి అపవాదు కల్పించునోయని చారుదత్తుడు భయపడెను. విదూషకుడు 'అంతగావచ్చి ఆమె అడిగినప్పుడు 'దీనికి సాక్ష్యమేమియు లేదుకనుక నీవీయలేదులే' అని నేనబద్ధమాడెదనులే' అనెను. చారుదత్తునివంటి వానికి అది హితవగునా? ముట్టెత్తియైన దానిసొమ్ము దానికిచ్చి, తన కీర్తిని కాపాడుకొందునని చెప్పెను. వెంటనే రదనిక లోనికేగి ఆ వృత్తాంతమును చారుదత్తుని భార్యయైన ధూతాదేవికి చెప్పెను. అతనికి తగిన భార్యయే ఆమెయు. ఆమె లోపలినుండి

'ఏమియు గాయములు తగులలేదు కదా!' అనుచు పరుగున ఎదురువచ్చి ఆత్రముగా నడిగినది. రదనిక నగలు పోయినట్లు చెప్పినది. అది వినుటతో నామెకు మరింత బాధకల్గినది.

ఇట్టి దరిద్రదశలో ఆ నగలను అమ్ముకొని తినెనని లోకులెక్కడ అనుమానింతురో యని ఆమెకును బాధ కల్గినది. ఆ స్త్రీ-మాస్త్రి ఆమెకు పుట్టింటి వారిచ్చిన రత్నహార మొక్కటి మాత్రము మిగిలియున్నది. దానిని భర్తకిత్తునను కొన్నను అతడు పుచ్చుకొనడు. అందుచే మైత్రేయుని పిలుచుకొనిరమ్మనెను. రదనిక వెళ్లి, మైత్రేయుని తీసికొని వచ్చినది. ధూతాదేవి 'ఆర్యా! తూర్పుముఖముగా కూర్చుండుము. నేను రత్నషష్టియని వ్రతముచేసితిని. దానికి దక్షిణగా ఈ హారమును తీసికొనుము' అనుటతో నతడు మహానంద ముతో పరిగ్రహించి, తన మిత్రునితో తెల్పెదననెను. ఆమె 'జాగ్రత్తసుమా! అతడీ వ్రతమున కింతయేనా దక్షిణయని చిన్నపుచ్చుకొనును' అని హెచ్చరించినది. ఆమె మంచి స్వభావమునకు మైత్రేయున కాశ్చర్యము వేసినది.

అతడు తనకై నిరీక్షించుచున్న ,చారుదత్తుని వద్దకు వచ్చి 'అయ్యా! ఇదిగో! ఈ నగను తీసికొనుము. అయినింటి బిడ్డను పెండ్లాడినందుకు ఫలితమిది' అనుటతో చారుదత్తుడు 'ఎంత కష్టమువచ్చినది. నేటికి 'స్త్రీ ధనము వాడుకొను దుర్దశ పట్టినదినాకు' అని, 'కాదుకాదు. నేనే చాల అదృష్ట వంతుడను. కలిమిలేములలో సరిగా గౌరవించు భార్య, కష్ట సుఖములు సరిగా పంచుకొను స్నేహితుడు దొరకినందున

నేను సత్యమును కాపాడుకొనగల్గితిని' అని సంతోషించి, మైత్రేయునితో 'ఈ రత్నావళిని తీసికొనివెళ్లి, వసంతసేనతో 'నేను ఆమె నగలను నావే అనుకొని జూదమున ఓడిపోయి నందున నాటికి బదులుగా దీనినంపితినని నా మాటగా చెప్పి, ఇచ్చి రమ్ము' అనెను. అతడు 'నీకు మతిపోయినట్లున్నదే. ఆ చిన్న నగకోసమై ఇంత విలువైన రత్నాలహారము నిత్తువా?' అని మందలించబోగా 'నీవు దీనిని ఆమెకిచ్చి, ఉదారముగా మాట్లాడి రానిచో నన్ను చంపుకొనితినన్నట్లే' అనెను. అప్పుడు విదూషకుడు 'దరిద్రున కుదారభావము లెక్కువగా నుండునులే' అనుచు వసంతసేన యింటికివెళ్లెను. చారుదత్తుడును ఆరీతిగా తాను ఋణవిముక్తుడగు చున్నందు లకు చాల సంతసించెను.

వసంతసేనకు చారుదత్తుని విడిచి కాలక్షేపమే అగుట లేదు. అతనిమీదనే దృష్టిపెట్టుకొని యున్నది. అతని చిత్ర పటమునుగీసి, దానిని చూచుచు వినోదించుచున్నది. ఇంతలో నొక దాసివచ్చి బండివచ్చినదని చెప్పినది. 'ఎవరంపినదే?' అని అడుగగా రాజుగారి బావమరది, సంస్థానకుడైన శకా రు'డని చెప్పి, అతడు పదివేల సువర్ణముల నగలనుకూడ పంపి నాడమ్మా!' అన్నది. 'ఛీఛీ! పోపో! నాకిట్టిమాటలు చెప్ప వద్ద'ని చీదరించుకొన్నది. 'మీయమ్మ చెప్పమన్నమూలాన చెప్పితిని; కాని నాకెందుకీ గొడవ? ఇప్పుడామెతో ఏమి చెప్పుమందువు?' అనగా 'నే బ్రతుకదలచినచో ఇక నెప్పుడు నిట్టి సందేశములు పంపవద్దని చెప్పు' మన్నది వసంతసేన.

ఆమె వెడలిపోయినది. వసంతసేన మదనికతో చిత్రపటమును పడకింటిలో పెట్టి విసనకర్ర తెమ్మని పంపినది.

ఇంతలో శర్విలకుడచ్చటికివచ్చి మదనికనెట్లు చూచుటయా? అని ఆలోచించుచున్నాడు. అతడందులకేకదా అంత కృషిచేసి దొంగిలించి తెచ్చినది. అంతలో ఆమె కన్పడినది. అతనికి నిధి దొరికినట్లైనది. వారిరువురు నొకరికేసి యొకరు ప్రేమదృష్టులు బరపుకొనిరి. ఎంతసేపు చూచినను వారికి తనివితీరలేదు. మదనిక ఆలస్యము చేయుచున్నదని వసంతసేన లోపలినుండి కిటికీలోనుండి చూచినది. వారి ప్రేమచూపులుచూచి, వారికి భంగము కల్గించుట భావ్యము కాదని వారి సంభాషణయేమో వినువేడుకతో నిలుచున్నది.

మదనిక 'ఇప్పుడిచ్చటికి వచ్చితివేమి?' 'నిన్ను విడిపించుటకే. ధనము తీసికొనివచ్చితిని' 'ఎక్కడినుండి?' చారుదత్తుని యిల్లట అది. తర్వాత తెలిసినది' 'అయ్యో! ఎంతపని చేసితివి?' 'ఏమి అట్లనుచుంటివి?' 'ఇది మా దొరసానిదే. అక్కడ దాచబెట్టినది. ఎవరిని చంపలేదుకద!' 'లేదు' అని వినుటతో వసంతసేనకు కొంత ధైర్యము కల్గినది. 'మదనికా! ఇప్పుడేమి చేయుదును? నీవేదో యుపాయము చెప్పుము?' అన్నాడు విచారపడుచు. 'వెళ్లి అతని సొమ్మతనికే యిచ్చివేయు' మన్నది. 'కాదు. అట్లుచేయుట మా సంప్రదాయ విరుద్ధమేకాక అతడు నేదొరకగానే రాజభటుల కొప్పజెప్పునేమో?' అనెను. 'అట్లయిన ఒక పని చేయుము. అతని మిత్రుడనని నీవేవచ్చి యీనగను వసంతసేన

కిమ్ము. దానితో నీకే బాధయు నుండదు' అతని కాలోపము కల్గదు. ఎవరిసొమ్ము వారికి చేరును' అన్నది. అతడట్లే అనెను. వసంతసేన 'మంచి యుపాయమే'అని తలయూచినది.

మదనిక వసంతసేనవద్దకు వచ్చి, 'అమ్మా! చారుదత్తుని వద్దనుండి ఎవరో బ్రాహ్మణుడు వచ్చినాడు' అనుటతో నాతని లోనికి రప్పించుమన్నది. ఆమె వెళ్లి శర్విలకుని లోనికి తీసికొనివచ్చినది. వసంతసేన అతనికి నమస్కరించి, పీటవేసి కూర్చుండుమని, వచ్చినపని అడిగినది. అతడు ఆమెను దీవించి, లేని ధైర్యము తెచ్చుకొని, 'నాయిల్లు ప్రాతదగుటచే దీనిని రక్షించుట కష్టము. కనుక నీది నీవు పుచ్చుకొమ్మ'ని చారుదత్తుడు పంపినాడు' అని చెప్పి, మదనికచేతి కానగనిచ్చి, వెళ్లిపోబోయెను. వసంతసేన అతని నాపి, 'అయ్యా! నే చెప్పెడి మాటకూడ అతనితో చెప్పుడు' అనుటతో నాతనికి ఉక్కిరిబిక్కిరియైనది. తాను మరల నచ్చటి కేమొగము పెట్టుకొని వెళ్లును? అయినను మాటలో తేలిపోవుట యెందుకని యా సందేశమేమో చెప్పుమనెను. వసంతసేన 'ఈనగనిచ్చిన వానికి మదనికనిచ్చి పెండ్లిచేయుమని చారుదత్తుని యాజ్ఞ. నేనా ప్రకారమిూమెను నీకిచ్చుచుంటిని. తీసికొనుమ'న్నది. అతనికి తమ మాటలీమె వినెనేమోయని అనుమానముతోచినది.ఆయినను మాటమార్చి, 'గుణవంతుడుకాని రాజైనను, గుణవంతుడైన దరిద్రునితో సరిరాలేడు. అందుచేతనే కావలసినది గుణము కాని రాజ్యముకాదు' అనెను. వసంతసేన బండిని చేయించి,

వారిద్దరిని ఆ బండెక్కి వెళ్లుమన్నది. మదనిక అట్టి యజమానురాలిని వదలి వెళ్లలేక కన్నులనీరు పెట్టుకొని, ఆమె పాదములకు నమస్కరించినది. వసంతసేన ఆమెను లేవనెత్తి, దీవించి బండెక్కించినది. శర్విలకుడు వసంతసేనను దీవించి, బండెక్కెను.

ఇంతలో చాటింపు వినిపించినది. పాలకుడు ఉజ్జయిని నేలెడిరాజు, ఉదయనునికి బావమరది. అతని కొకనాడు సిద్ధులు భవిష్యత్తు చెప్పుచు, 'నీ తర్వాత నీ రాజ్యమును వ్రేపల్లెలోని ఆర్యకుడను గోపాలబాలకుడు పరిపాలించును' అని చెప్పిరి. అది వినుసరికి రాజునకు తన రాజ్యముపోవునని భయము వేసినది. వెంటనే ఆ బాలకుని పట్టితెప్పించి ఖైదులో వేయించెను. 'అతని నెవరును కాపాడరాదు' అని చాటింపు వేసిరి. అది వినుటతో శర్విలకు డతని బాల్యమిత్రుడైనందున అతని రక్షింపబూని క్రొత్తగా చేపట్టిన భార్య నేమిచేయుటయా? అని ఆలోచించెను. నన్ను అత్త వారింట దిగవిడువు మన్నదా మదనిక. 'సరే' అని అతడామె ఆమెను రేభిలుని యింటివద్ద దింపుమని బండివానితో చెప్పి తానార్యకుని విడిపించుటకై వెళ్లెను.

అంతట చేటివచ్చి చారుదత్తుని వద్దనుండి బ్రాహ్మణుడు వచ్చెనని వసంతసేనతో విన్నవించినది. ఆమె లోనికి రప్పింపుమని సెలవిచ్చినది. వచ్చినవాడు మైత్రేయుడు. అతడిదివర కెన్నడును ఆమె యిల్లు చూడలేదు. అతనికది చూచుటతో ఆశ్చర్యము వేసినది. ఇంద్ర భవనమా? అని

పించినది. తాను నైష్ఠిక బ్రహ్మచారి యగుటచే రాలేదు. కాని జన్మానికొక్కసారియైనను చూడతగిన దనిపించినది. ఆ సింహద్వారము ఏనుగు దంతము చెక్కి చేయించినదే. దానికి నవరత్నములు పొదివినారు. పైన జెండా ఎగురుచున్నది. ద్వారమునకు పైన పచ్చని మామిడి చిగుళ్లు తోరణములు కట్టిరి. రత్నాల స్తంభములపై మంగళ కలశముల నుంచిరి. తలుపు రెక్కలు చాల విశాలముగా నున్నవి. వాటికి సందు లేకుండ వజ్రముల తాపిరి. అదెంతో మనోహరముగా నున్నందున రెప్పవేయక అతడు చూచుచుండ, దాసి వచ్చి 'అయ్యా! లోనికి దయచేయుడు!' అన్నది. అతడు రెండవ మొగసాల ప్రవేశించెను. అచ్చట రంగుల ముగ్గులు బాగున వజ్రాలు, రత్నాలుతో భూమి చప్టాచేసిరి. కిటికీలకు ముత్యాల దండలు వ్రేలాడవేసిరి. అక్కడనున్న ద్వారపాలకుడు పనిలేనందున వృద్ధశ్రోత్రియుడువలె కునుకుపాట్లు పడుచున్నాడు. పెరుగు కలిపిన అన్నమునుకూడ కాకులు సున్నపు ముగ్గులే అనుకొని ముట్టనైన ముట్టలేదు. తర్వాత నతడు మూడవ ద్వారము దాటెను. అచ్చట బండిగిత్తలు చిట్టు తినుచున్నవి. కొందరాగిత్తల కొమ్ములకు నూనెరాయుచున్నారు. కొందరు పొట్టేలు మెడను తోముచున్నారు. గుర్రాల కొంటిమీది జుట్టును కత్తిరించి బాగుచేయుచున్నారు. ఒక వంక మావటివాండ్రు నూనె, నేయి కలిపిన అన్నమును ఏనుగులకు ముద్దలు చుట్టిపెట్టుచున్నారు.

అతడింకొక గుమ్మము దాటెను. అక్కడ చిలుకలు గోరువంకలు నున్నవి. రకరకములైన చిత్రపటములను చేతపట్టి వృద్ధవిటులు, సానులును ఇటునటు తిరుగుచున్నారు. మరొక గుమ్మము దాటగా, అచ్చట స్త్రీలు మద్దెలలు, వీణ మున్నగు వాద్యములను ప్రోయించు చుండిరి. కొందరు నాట్యమును నేర్చుకొనుచున్నారు. వారిప్పుడైదవ మోసాల ప్రవేశించిరి. అది వంటయింటి దాదాపున నున్నది. లోపల చేయు భక్ష్యభోజ్యముల సువాసన గుబాళించు చున్నది. ఇంగువనూనె వేసిన తాలింపు గుమగుమలాడుచు దరిద్రులకు నోరూరించుచున్నది. అక్కడి లడ్డులు, అపూపములు చూచుటతో అతనికెవనికైన మశికట్టుకొను మందురేమో అనిపించినది. అంత పుణ్యము కట్టుకొన్నవా రెవరును లేరు. అచ్చట సంద్రుల నెరుగనివారు 'బంధువులు' లన్న పేర్లలో నుండిరి. మైత్రేయుడు లోనికేగెను. అచ్చట రత్నపరీక్షకులు నవరత్న పరీక్ష చేయుచున్నారు. కొంద రగసాలులు నగలజేయుచున్నారు. కొందరు వజ్రాలను సానపట్టుచున్నారు. మంచి గంధము తీయువారు, అగరువత్తులు వెలిగించువారు, పూలదండలల్లుచు గుచ్చు వారితో నెంతో సందడిగానున్నది. కొందరు వేశ్యాయువతు లచ్చట కాముకులను తాంబూలరసము నిచ్చుచు ధన్యుల జేయు చున్నారు.

ఒకచోట కేవలము పక్షిజాతు లన్నిరకములున్నవి. నెమళ్లకునాట్యము, హంసలకు నడక, చిలుకలకు, గోరువంకలకు పచ్చతీతువులకు మాటలను నేర్పుచున్నారు. అది

ఇంద్ర భవనమో కుబేరభవనమో అనిపించినది. కాని వేశ్యా గృహమని అతని కనిపించలేదు. అక్కడ వసంతసేన అన్న యట సర్వాంకారభూషితుడై యున్నాడు. వానిని చూచి ధన్యుడనైతినని, తర్వాత 'ఇతడేమిటి? ఎన్ని అలంకారము లున్ననేమి? శ్మశానములోని సంపెగ చెట్టువలె శోభించుట కదా!' అనుకొని ముందుకేగెను. అచ్చట వసంతసేనతల్లి చాతుర్థిక జ్వరముచే కాళ్లువాచి లేవలేక, అట్టచెప్పులు తొడిగికొని, ఈగలు ముసరకుండ కాళ్లపై పల్చని పువ్వుల చీర కప్పుకొని కూర్చున్నది. మైత్రేయుడు నవ్వాపుకొనలేక పెద్దగా నవ్వుచు 'ఈమె యెవరు?' అని అడిగెను. 'ఈమె వసంతసేన తల్లి' అని చేటి చెప్పగానే అతడు 'ఈమెను ముందుగా లోపలపెట్టి తర్వాత ఇల్లుకట్టిరా? లేకున్న ఈమె ఈ ద్వారము పట్టదుగదా! యెట్లు లోనికి తేవీలగును? ఈమె చచ్చినచో నక్కల కానుమాసములు విందు జరుగు'నని పెద్దగా నవ్వుచుండెను. చేటి 'ఈమెనుచూచి నవ్వరాదు' అని నవ్వు తగ్గించినది.

అతడు 'ఈ భవనమెంతయున్నది? నడువలేక నా కాళ్లు లాగుచున్నవి కాని భవనము తరుగుటలేదు. వసంత సేన యెచ్చట నున్నది?' అని యడుగగా ఆమె 'నీకీ లోపల నున్నంత సేపట్టులుండును కాని ఆ గదే ఆఖరుది. మా యజ మానురాలు ఉద్యానవనములో నున్నది' అని అక్కడికి తీసికొనివెళ్లినది. ఆ యుద్యానములో లేని పూలమొక్కలు లేవు. మధ్యనొక దిగుడుబావియున్నది. దానిలో తామరలు,

కలువలు చక్కగా శోభను వెదజల్లుచున్నవి. అతడామె కూర్చున్నచోటికి వచ్చెను.

అతనిని చూచుటతో ఆమె లేచి స్వాగతము చెప్పి పీటవేసి అతనిని కూర్చుండ పెట్టినది. చారుదత్తుని కుశల మడిగి వచ్చినపని నడిగినది. అతడు 'మా చారుదత్తభట్టార కుడు నీకు నమస్కరించి యిట్లు విన్నవించమనుచున్నాడు' అనగా ఆమె వినయముతో 'అయ్యా! అంతమాటెందుకు? ఏమని ఆజ్ఞాపించిరి?' అన్నది. అతడు 'నీ నగను నాదే అను కొని జూదములో ఓడితిని. కాన దానికి బదులుగా ఈ రత్నాలహారమును పుచ్చుకొనుమన్నాడు. ఆ గెల్చిన జూదరి యెవడో తెలియదు' అనుటతో ఆమె చేటి 'నీ యదృష్ట మెంత మంచిదమ్మా! నీ ప్రియుడు జూదరియైనాడు' అన్నది నవ్వుచు. వసంతసేన రత్నావళిని పుచ్చుకొందునా? నగను చూపుదునా? అని ఆలోచించినది. మైత్రేయుని కొల్లుమండి నది. 'ఏమిటి అనుమానించు చుంటివి? రత్నావళిని పుచ్చు కొనవా?' అనెను. ఆమె వెంటనే పుచ్చుకొన్నది. 'ఆ జూద రితో నేను సాయంకాలము వత్తునని చెప్పుమ'న్నది. 'ఇది యింటికి వచ్చి ఇంకను ఏమైన లాగునేమో?' అనుకొని 'ఆఁ చెప్పెదనులే' అని పైకని 'వేశ్యలతో సంబంధమింక మాను మని చెప్పెదను' అనుకొని వెళ్లిపోయెను. ఆ రత్నావళి నలంకరించుకొనియే ఆమె చారుదత్తునింటికి వెళ్లుటకై సన్నా హాపడినది. అంతలో మబ్బుక్రమ్మి చీకటిపడినది. ఏదేమైనను తప్పక వెళ్లదలచి సిద్ధమైనది.

చారుదత్తుడు సాయంకాలమున నుద్యానవనములోని కేగెను. అంతలో అకాలమేఘములు క్రమ్మినందున ఇదేమా? అని చూచుచు, వసంతసేన యింటికేగిన మైత్రేయునకై వేచియుండెను. మైత్రేయుడు వచ్చి చారుదత్తుని వెదకి కొనుచు ఉద్యానమునకు వచ్చెను. అతనికి మర్యాద సరిగా చేయలేదని అతని కెంతయో కోపముగానున్నది. విశ్రమించు మనిషైన ఆనకపోగా రెండవ ప్రస్తావనయే చేయక రత్నా వళిని పుచ్చుకొని యూరకున్నది. ద్రవ్యాశలేని సాని యుండునా? అనుకొని చారుదత్తునిచూచి అతని దీవించి కూర్చుండెను. అతడు జరిగిన కథనడుగగా 'ఆమె రత్నా వళిని హాయిగా పుచ్చుకొన్నది. పైగా నాయెదుట పైట చెరగు మొగమున కడ్డుపెట్టుకొని నన్నుగూర్చి నవ్వినది. మిత్రమా! ఇంతయు నీవలనగదా వచ్చినది! నామాట విని నీవింకపై నయినను ఆమెతో సాంగత్యము మానుమయ్యా!' అనుటతో అతడు 'ఇక నీవు చెప్పనక్కరలేదు. ఈ దరిద్రుని వద్దకింక ఏ వేశ్యవచ్చునులే' అనగా అతడు 'ఆర్యా! ఆమె సాయంకాల మిక్కడికి వత్తునన్నది. ఇంకను ఏమైన లాగుట కేమో?' అనుటతో చారుదత్తుడు 'సంతోషపరచియే పంపు దములే' అని నవ్వుచు జవాబిచ్చెను.

అప్పుడు వసంతసేనవచ్చి కుంభీలకునిద్వారా తన రాకను తెలిపినది. అతడువచ్చి మైత్రేయునిపైకి బెడ్డ విస రెను. అత డులిక్కిపడి వెంటనే తలుపుతీసెను. ఆమె వచ్చిన వార్తను తెల్పినందులకు కుంభీలకునకు తన యుత్తరీయమును

బహూకరించెను. అంత వసంతసేన ఛత్రధారిణి, చేటి, విదూషకుడు లోనికి వచ్చిరి. లోనికి రాగానే విదూషకునితో 'నీ విక్కడనే యుండి గొడుగు పట్టించుకొ'మ్మన్నది. అతడు వెళ్లిపోయి లోనికి రావలదని వ్యంగ్యముగా చెప్పినదని అక్కడనే ఆగిపోయెను. మైత్రేయుడామె కెదురేగెను. 'మీ జూద డెచ్చట నుండెను?' అని ప్రశ్నించినది. అతడెప్పుడు చెప్పినను అకటావికటపు జవాబే. 'ఆ యెండుచెట్ల గుంపులో నున్నా'డనెను. 'అదేమి? ఉద్యానమును ఎండు చెట్లనవ రేల?' అనగా అతడు 'ఇవి కాయలిచ్చునా? పళ్లిచ్చునా? ఎందుల కివి?' అని నిస్పృహ చూపెను.

ఆమె చారుదత్తుని సమీపించినది. అతడు పీటపై కూర్చుండుమని కుశలప్రశ్న లడిగెను. ఆమె జవాబియ్యగానే ఆమె చీర వానజల్లునకు తడిసియున్నదని మరొక వస్త్రములు తెమ్మనగానే ఆమె చేటి నేనే తెత్తునని తెచ్చియిచ్చినది. చారుదత్తుని అనుజ్ఞపై మైత్రేయుడు 'నీవింత దుర్దిన సమయమున ఎందుకు వచ్చితివమ్మా!' అన్నాడు. ఆమె చేటికి సైగచేసినది. చేటి 'మీవిచ్చిన రత్నావళి ఖరీదెంతయో తెలిసికొన వలెనని వచ్చితి'మన్నది. అతడు చారుదత్తునితో 'నే చెప్పలేదా? ఈమెకు రత్నావళి సరిపోయినది కాదు పాపము!' అని రహస్యముగా చెప్పి చేటితో 'ఏలాగో?' అనెను. చేటి 'అది తనదే అనుకొని యీమె జూదములో ఓడిపోయినది. ఆ గెల్చిన వాడెవడో తెలియదు. అందుచే అది యిచ్చువరకు ఈ నగను నీవద్ద నుంచుము'ని ఇదివరలో

దాచిన నగనే యిచ్చినది. అతడు దానిచూచి 'అదామె కెట్లు వచ్చెనా?' అని తెల్లపోయినావాచెను.

చారుదత్తునితో 'ఇదీమె కెట్లువచ్చినదో? మనయింటిలో దొంగిలించి, వీరియింటిలో పారవేసినాడేమో ఆ దొంగ' అనెను. అతడు 'మనము చెప్పినమాటలే మన తప్పజెప్పినది. ఇందు నిజమెంతయో కనుగొనుమనెను. మైత్రేయుడు రహస్యముగా చేటి నడిగెను. ఆమెయు రహస్యముగానే వారనుకొన్నది నిజమేయని చెప్పినది. అప్పుడా ప్రియవాక్యము చెప్పినందుల కామెకు బహుమతిగా నుంగరమును చారుదత్తుడీయబోయి వ్రేలు చూచుకొనగా దానికుంగరములేదు. అతనికి సిగ్గువేసినది. 'డబ్బులేని నాడెంతటను పనికిరాడు కదా! వానికి కోపము వచ్చినను, అనుగ్రహము వచ్చినను వ్యర్థమే. పాడుబడ్డ యిల్లు, మోడైపోయిన చెట్టు, నీరులేని నుయ్యి, డబ్బులేనివాడు సమానము' అని చారుదత్తుడనుకొనెను. అప్పుడు వసంతసేన 'ఆర్యా! పోయిన వస్తువునకై నాకు రత్నావళిని ఏదేదో కల్పించిచెప్పి ఈయవలెనా?' అని తనలోనున్న బాధను తెల్పుచు మెల్లగా పల్కినది. అతడు ఆమె అట్లనునని అనుకొనలేదు. తాను చేసినది తప్పుగా నున్నట్లు ఒప్పుకొని, 'వసంతసేనా! నిజము తెలియక లోకులు పలురీతులు పల్కుదురు. మనము వారినోళ్లు మూయలేము కదా! అందుకై యిట్లు చేయవలసివచ్చినది' అని సమాధాన పరచెను. ఇంతలో వాన చినుకులు హెచ్చుగా పడసాగినవి.

వసంతసేన భావము కనిపెట్టి చారుదత్తుడు 'ఈ వర్షము బాధ లేకుండ లోనికి పోవుదమ'ని ఆమెను లోనికి గొనిపోయెను.

చేటితోసహా ఆమె అప్పుడక్కడనే ఉన్నది. చారుదత్తుడు ఈనాడెంత దరిద్రమైనను సగసుడుకదా! ఆరాత్రి కామె కోరిక, తన కోరికయు తీరునట్లు సుఖించెను. వారికి ఆరాత్రి ఇట్టే తెల్లవారినది. సూర్యులు మాత్రము పూర్తి కాలేదు. రాత్రి నంతను క్షణమునలె గడపి, వేకువజామున నే పరుండిరి. కాని నిత్యకర్మానుష్ఠాన పరుడైన బ్రాహ్మణుడు కనుక చారుదత్తుడు మాత్రము సూర్యోదయము కాకమునుపే లేచి, నిత్యకర్మలు నిర్వర్తించుకొనుటకు వెళ్లెను. అప్పుడు పరిచారిక వచ్చి, వసంతసేనను మేల్కొల్పెను. ఆమె యింకను తెల్లవారలేదనుకొని చేటిని కసరినది. చేటి 'నీకు తెల్లవారలేదుకాని మాకు ప్రొద్దే యెక్కినది' అని పరిహసించినది. అప్పుడామె లేచి, సింగారించుకొని, చారుదత్తు డెక్కడనుండెనని ప్రశ్నించెను. అతడు పుష్పకరండకమను జీర్ణోద్యానము లోనికి ఆమెను తీసికొనిరమ్మని వర్ధమానునితో చెప్పివెళ్లెను. ఆ మాటనతడు బండి తీసికొనివచ్చి చెప్పగానామె, 'ఇప్పుడే అలంకరించుకొని వత్తున'ని లోనికి వెళ్లినది. అతడును బండిలో వేయు కంబళి మరచిపోయినందున తెత్తునని, గిత్తలాగవని బండితోలుకొనియే వెళ్లెను.

మైత్రేయునిద్వారా తనకు వచ్చిన రత్నావళిని మరల ధూతాదేవి కిమ్మని చేటిచే బంపినది. కాని ఆమె 'నాకు చారుదత్తుడొక్కడే అలంకారము కాని తక్కినవగలుకావు.

ఆయన దయతో ఏకిచ్చినది నేమరల తీసికొనుట బాన్యము కాద'ని తిరిగి పంపివేసినది. అప్పుడే చారుదత్తుని కొడుకు రోహసేనుడు త్రోడి బాలునితో బంగారు బండితో నాట లాడి, తనకది కావలెనని మొండిపట్టు పట్టెను. రదనిక ఒక మట్టిబండి (మృచ్ఛకటికము) ని చేసియిచ్చినది. ఆ బాలుడు వయసునకు చిన్నవాడైనను మాటలలో, చేతలలో పెద్దవాడే. అతడామె మాటలను లెక్కసేయక బంగారు బండికై పేచీ పెట్టెను. అదిచూచి వసంతసేన ఆ పిల్లవాడెవరని అడిగి తెలిసికొన్నది. అతని నెత్తుకొని, 'ఇతడు ముమ్మూర్తులా తండ్రిపోలికయే' అని ముద్దాడినది. రదనిక ఆ బాలుని పెంకిపట్టు తప్ప అన్నిగుణములు మంచివని కొనియాడినది.

వసంతసేన 'చారుదత్తుని వంటి వానికొడుకు ఇతరుల వస్తువులను తెమ్మని యేడ్వవలసి వచ్చెగదా!' అని విచారించినది. అది విధివిలాసము. ఎవరేమి చేయగలరు? బాలుడు 'ఈమె యెవరు?'అని అడిగినాడు. రదనిక 'మీతల్లి బాబూ! దండము పెట్టు'మన్నది. 'కాదు. ఈమె నా తల్లియైనచో ఇన్నినగ లెట్లుండును?' అనెను. అతడు నగలున్న రోజులలో తల్లినిచూడలేదు కదామరి! వసంతసేనకు కన్నుల బొటబొట నీరుకారినది. నగలన్నియు తీసివేసి 'ఏమి? ఇప్పుడు నీతల్లి వలె నుంటినా?' అని ఆ నగలచే నతనికి బంగారుబండి చేయించుమని చెప్పి మట్టిబండిలో వేసినది. పిల్లవాడు బండిలాగికొని వెళ్లిపోయెను.

అప్పుడిక వసంతసేన సింగారించుకొన్నది. ఇంతలో వీధిలోనికి స్థావరకుడను శకారుని బండివాడు గిత్తలబండి తోలుకొని వచ్చుచుండెను. వీధిలో బళ్లన్నియు కిటకిట లాడుచున్నవి. వెళ్లుటకు సందులేదు. అప్పుడే ఎవడో బండి వాడు తన బండి చక్రము బురదలో దించుకొనిపోయినందున కొంచెము చేయూతనిమ్మని కోరుచున్నాడు. ఎట్లైనను వెళ్లు టకు వీలులేదుకదా అని స్థావరకుడు చారుదత్తుని యింటి గుమ్మము ముందాబండి నాపి, వానికి సాయముచేయుటకై వెళ్లెను. ఆ బండివంక సరిగా చూడక అదే తమదను అపో హతో వసంతసేన ఆ బండినే యెక్కినది. అంతలో స్థావరకుడు పనిపూర్తి యగుటచే వచ్చి బండిని చురుకుగాతోలెను. బండి, క్రొత్త గిత్తలైనందున ఉరకలు-పరుగులుగా వెళ్లిపోయినది.

ఇంతలో వర్ధమానకుడు బండితోలుకొని వచ్చెను. అప్పుడు వెళ్లిన శర్విలకుడు ఖైదునకే కన్నముపెట్టి సంకెలలు మధ్యకు తెగగొట్టి ఆర్యకుని విడిపించి పారిపొమ్మనెను. అతడు 'నేనేమి తప్పుచేసితిని? ఒక వేళ నాకు రాజ్యము వచ్చునని చెప్పినచో అందుకు నేనేమి చేయుదును? అంతగా వచ్చునవేయైన కాలడ్డుపెట్టినంత మాత్రాన భాగ్యము లాగునా! నేనొక్కడను మహారాజుతో పోరలేను కదా!' అనుకొని పరుగెత్తజూచుచు ఎదురుగా బండి యున్నందున దానిలోనికెక్కెను. అది వర్ధమానకుడు తోలుకొనివచ్చిన బండియే. అతని ఇనుప గొలుసుల చప్పుడు అందెల చప్పుడే అనుకొని వర్ధమానకుడు బండిత్రోలుచుండెను.

రాజభటులకు ఆర్యకుడు పారిపోయెనని తెలిసెను. వెంటనే సేనాపతి నలుమూలలకు సైనికులను పంపి ప్రవేశ మును, ప్రతిచోట పరీక్షింప జేయుచుండెను. ఒక్క[illegible] క్రమ్మిరి. అందు వీరకుడు, చందనకుడు అను సమాన[illegible] నలంకరించిన సైనికోద్యోగులు వర్ధమానకుని బండిని పరీ క్షింప వచ్చిరి. ఆ బండి యెవరిదని అడిగిరి. బండివాడు చారుదత్తునిదనెను. ఎవరిదైననేమి? మన పని మనము చేసి కొందమని అందొకడనెను. చందనకుడు [illegible] పోనిమ్మనెను. వీరకుడు 'నసేమి. వల్లకాద'నెను. [illegible] తగవు పెరిగినది. బండిలోనున్న ఆర్యకుని గుండెలు [illegible] లాడుచున్నవి. వారువచ్చి చూచినచో ఇక దిక్కెవ్వ[illegible] అయినను ఒకడు జన్మాంతర బంధువు; మరొకడు [illegible] లాగున ఉన్నారు. ఒకే యుద్యోగమైనను వారిలో, [illegible] లోను, కాటిలోను ఉండు అగ్నులకువలె చాల భేదమున్నది. వారు నేచూచిన నీవు చూడవుకదా! అని ఒకరినొకరు [illegible] ఆర్యకుని అదృష్టము కొలది చందనకుడు బండినెక్కెను. ఎక్కీ ఎక్కటతోడనే లోనుండి ఆర్యకుడు 'అయ్యా! [illegible]! శరణు' అనెను. 'నీకేమియు భయములేదు. [illegible]?' అని అడిగెను. అతడు జరిగినదెల్ల చెప్పెను. ఆతడు [illegible] మిత్రుడైన శర్విలకుని మిత్రుడనియు, శరణన్న వానిని [illegible] వయతలచి అభయమిచ్చి దిగిపోయెను. వీరకుడడుగగా ఆర్య కుడనబోయి ఆర్యా[illegible] అనెను. ఆ మాటల[illegible] వీరకుడు తాను పరీక్షింతుననెను.

చందనకునికి తనమాట బోటుపోవుననియు, ఆర్యకున కపటాచారము జరుగుననియు భయపడి అంవతగాదా (గిల్లికజ్జా) పెట్టుకొనదలచి 'అరే. ముందేమంటివి? నేనుచూచినతర్వాత మరల నీవుకూడ చూడవలెనా? అంత నమ్మకములేనివాడవు నీవే ముందు చూడలేకపోతివా?' అనుటతో వీరకుడు నీజాతి యేమిటి? నీతియేమిటి? మంగలివానికి నీ కధికారమిచ్చిన వానిది తప్పు. నిన్ను నమ్మవాడెవడురా?' అనుటతో 'ఆహాహా! గురివెందగింజవలె క్రిందనలుపెరుగక వదరెదవేమి? చర్మకారుడవు (మాదిగవాడవు) నీవుకూడ నన్ననవలెనా? తగ్గు తగ్గుము' అనెను. 'రోరు మూయు'మని చందనకుడు గద్దించెను. అతడు బండెక్కబోయెను. చందనకు డమాంతముగా వానిని జుట్టుపట్టుకొని క్రిందికిలాగి నాల్గు తాపులు తన్నెను. 'సరే కొట్టుదువుగా. ఏమి చెప్పుదువో అధికరణమున? (కోర్టులో) చూతునులే' అని ఒళ్లు దులుపుకొని కోర చూపులు చూచుచు వీరకుడు వెడలిపోయెను. చందనకుడు 'ఓరీ బండివాడా! ఇక ఎవరైన చూడబోయినచో వీరకచందనకులు చూచిరని చెప్పరా?' అనుచు ఆర్యకునితో 'అమ్మా! నన్ను మరువకుము. ఎవరైన అడిగినప్పుడీఆనవాలు చూపు' మని అతనికి తన కత్తి నిచ్చెను. అతని చేతిలో కత్తిలేదను విచారము దీనితో తీరినది. ఇతడు చేసినది అందుకే. బండి ఉద్యానమును చేరినది.

చారుదత్తుడును, మైత్రేయుడును ఉదయముననే ఉద్యానమున కేగిరి. అప్పుడప్పుడే వికసించుచున్న పూల

వాసనలను ఆఘ్రాణించుచు, పూలుకోయక యే లతల అందము చూచుచు ఆ మిత్రులు షచార్లు చేయుచుండిరి. కొంచెము ప్రొద్దెక్కినది. వర్ధమానకు డింకను బండితోలుకొని రాలేదు. ఏల ఆలసించెనోయని చారుదత్తు డనుమానించెను. ఇంతలో బండివచ్చి ఆగినది. లోపలనున్న ఆర్యకుడు 'ఊరువదలి చాలదూరము బండివచ్చినది. ఇక రాజసేవకులు రాక పోవచ్చును. దిగిపోవుదునా? లేక చెట్లచాటున దాగుదునా? చారుదత్తుని చూతునా?' అని ఆలోచించి, చారుదత్తుడు చాల దయగలవాడని వింటిని. అతనిచూచిన నాకు మరి కొంత బాధ తప్పగలదు' అనుకొని, అతని కలియుటకే నిశ్చయించుకొనెను. మైత్రేయుడు బండివానిని కోపించి, వసంతసేనను చప్పున దింపుమనెను. ఆమె త్వరగా దిగనందున మైత్రేయుడు వెళ్లి బండిలోనికి చూచి, 'వసంతసేన కాదయ్యో! వసంతసేనుడు' అని అరచెను. చారుదత్తుడు 'వేళాకోళము చేయకుము'ని తానే బండెక్కిచూచి, ఇతడెవరో గొప్పవాడువలె కన్పడుచున్నాడు. మరి 'కాలికి సంకెలలేల వైచిరో' అని అతని నడిగెను. అతడు వణకుచు 'అయ్యా! నేను ఆర్యకుడను. శరణు పొందితిని రక్షింపుము' అనెను. చారుదత్తుడు 'ఓహో! నీవా! రాజు ప్రేపల్లెనుండి రప్పించి, ఖైదులో పెట్టించినవాడవా!' అని 'ఔగాక! ఏది ఏమైనను శరణన్న నిన్ను రక్షించి తీరెదను' అనుటతో ఆర్యకునికి అపరిమితానందము కల్గినది. వర్ధమానకునిచే కాలి సంకెల లూడదీయించెను. మైత్రేయుడు 'ఇక వెళ్లిపోవుదము'నెను.

ఆర్యకుడు చారుదత్తునికి కృతజ్ఞత తెల్పి, నమస్కరించి, సెలవుతీసికొని, వెళ్లుచుననెను. కాని చారుదత్తుడు 'ఇప్పుడే శాలి సంకెలలు తీసినందున నీకాళ్లు బరువులుగానుండి, త్వరగా నడువనీయవు. అందుచేత ఈ బండిమీదనే వెళ్లుమ'నెను. అతడు సంతోషముతో బండెక్కి వెళ్లిపోయెను. చారుదత్తుడు ఆ సంకెలలను నూతిలో పారవేయించి, మైత్రేయునితో కలిసి వెంటనే యింటికి వెళ్లిపోయెను.

సంవాహకుడు క్రొత్తగా బౌద్ధభిక్షు వయ్యెనుకదా! అతడు ధర్మోపదేశము చేయుచు వీధులవెంట తిరిగి, జేగురు గుడ్డను జాడించుకొనుటకై పుష్పకరండ కోద్యానమునకు వచ్చెను' అప్పటికే శకారుడు, విటుడును వచ్చిరి. ఒకప్పుడెప్పుడో శకారుని ఒక బౌద్ధసన్యాసి తిట్టి, కొట్టెనట. అందుచేత నతడు కనపడిన బౌద్ధభిక్షువు నెల్ల ఆబోతులకువలె ముక్కులు కుట్టించి పరుగెత్తించు చున్నాడట. అందుచే అతనిని చూచుటతో ఈ క్రొత్తభిక్షువునకు పై ప్రాణములు పైన పోయినవి. ఇతడనుకొన్న ట్లే శకారుడుకూడ 'నీ తల చితుక కొట్టెదన'నుచు కేకలు వేసెను. అతడు రక్షింపుమని బ్రతిమాలగా నితడు తిట్టుచున్నాడనుకొనెను. విటుడు 'అతడు నిన్ను పొగడుచున్నాడు గాని తిట్టుటలేదని సర్దెను. అప్పుడు శకారుడు అతడు వచ్చిన పనియేమని అడిగి, చెరువులో గుడ్డలు జాడించుకొనుటకని అడుగగా 'ఓరీ దుర్మార్గుడా! మా బావగారు నాకు బహుమతిగా నిచ్చిన ఈ యుద్యానములోని ఈ చెరువులో కుక్కలు, నక్కలు మంచినీళ్లు

త్రాగవలెను కాని నేనే యెప్పుడును స్నానముచేయను. ఇక నీవు గ్రుడ్డలుతికెదవా? బుద్ధిలేదా?' అని తన్నఁబోయెను. విటుఁడు 'ఇతఁడెవరో క్రొత్త భిక్షువు. వదలుమ'నగా 'ఓరీ! నీవు పుట్టగానే యెందుకు సన్యసించలేదు?' అని తన్నెను. తన్న వలదు. వదలుమని విటుఁడు చెప్పఁగా శకారుఁడు తనలో తానేదో వెర్రి ఆలోచనచేసి 'బావా! నా అంతరాత్మ వీడిని వెళ్లనీయక, ఉండనీయక, దిగఊపిరి, యెగఊపిరి రాకుండ ఇక్కడే పడిచచ్చునట్లు చేయుమని చెప్పినది. అయినను ఇతఁడు నీరు కలగకుండ బురదను కలిపినగాని లేదా [illegible] మూటగట్టి బురదలో వేసినగాని వదలెదను' అనెను. వాని మూర్ఖత్వమునకు వారిద్దరును లోలోన సణిగికొనిరి. భిక్షువు శకారుని తిట్టుచు వెళ్లిపోయెను. విటుఁడు మెల్లగా ఉద్యానవన శోభను చూపుచు కొంతసేపు కాలక్షేపము చేసెను.

శకారుని కదంతయు చూడగానే వసంతసేన గుర్తు వచ్చినది. 'బావా! స్థావరకుడింకను బండితోలుకొని రాలేదే. పైన యెండ చిర్రుమను చున్నది. నడిచిపోలేము' అని గొంతెత్తి గార్దభ స్వరమున నొక్కపాటపాడి యెట్లున్న దనెను. విటుఁడు 'ఆహాహా! ఏమిపాట! ఒక్కమాటు విన్న వాడు మరల పాటయన్న అరోచకము కలిగిపోడా! నీవు సాక్షాత్తు గంధర్వాంశను పుట్టినవాడవు' అనుటతో నత డుబ్బిపోయి 'కాకేమి? మిరియము, ఇంగువ కలిపినూరి, నేతితో వేయించి, ముద్దచేసికొని కోకిలలతోపాటు నేనును తింటిని. స్వరమాధుర్యము నాకురాక మరెవ్వరికి వచ్చును?'

అనెను. ఇంతలో స్థావరకుడు బండితోలుకొని వచ్చెను. శకారుడు ఆ బండిని గోడమీదినుండి తోలుకొని రమ్మనెను. బండివాడు 'గిత్తలు, నేను చచ్చిపోవుదుము. బండి విరిగిపోవు ననగా శకారుడు 'బండి చచ్చినను, నీవు, నెద్దులు విరిగి నను నాకేమియు బాధలేదు. రమ్ము. అటేరమ్ము' అనెను. స్థావరకుడు మెల్లగా సరియైన దారినే బండి తోలుకొని వచ్చెను. 'ఏమిరా! బండి చావలేదేమి? గిత్తలు తెగలేదేమి? త్రాడు విరుగలేదేమి?' అని, విటుని 'అయ్యా! నీవే ముందు బండెక్కుము' నెను. అతడెక్కబోవు చుండగా 'ఓరీ! నీయబ్బ సొమ్మా? నీవెక్కుదువటరా ముందు. మా బండి నేనే ముందెక్కుదును' అని క్రిందికి లాగెను. విటుడు తెల్లబోయి 'నీవే యెక్కుమంటివి కదాముందు' అని సన్నగా అనగా 'ఓరీ తెలివితక్కువవాడా! నేను నిన్నెక్కుమందును. అప్పుడు నీవు నన్నెక్కుమ'ని గౌరవించవలెను. ఆపాటి మర్యాద కూడ తెలియనివాడవు నీవు' అని తాను బండెక్కెను. లోపలఉన్న వసంతసేనను చూచి క్రిందికురికి, అమాంతముగా విటుని కంఠము పట్టుకొని 'బావా! ఇంకేమున్నది? నీవు చచ్చిపోతివి. దానిమీద రాక్షసియో, దొంగయో ఉన్నది' అనెను. విటుడు 'స్థావరకుని నీడచూచి నీవు కంగారు పడుచుంటివి' అనిన 'కాదయ్యా బాబూ! బండిలో నెవతెయో యున్నది చూడుము' అనెను.

లోపలనున్న వసంతసేన వీరి సంభాషణ విన్నది. ఆమెకు కన్పడిన అపశకునములు ఫలించెనని బాధపడుచు,

ప్రాణము లరచేత పట్టుకొని కూర్చున్నది. శకారుడు విటుని బండెక్కి చూడుమని 'ఇతని నారాక్షసి దంతములతో చూచి, కన్నులతో తినులోపల నేను పారిపోవలె' నను కొనెను. విటుడు వసంతసేనను చూచి, ఆశ్చర్యపడి 'ఏమి?' అని సంజ్ఞచేసినాడు. ఆమె 'పొరపాటున బండిమారి వచ్చితిని. రక్షింపుమ'న్నది. అతడామెకు ధైర్యము చెప్పి, బండి దిగి 'ఇందులో నిజముగ రాక్షసియే యున్నది. మనము నడచిపోవుద' మనెను. అది విని శకారుడు 'దారిలో దేవ బ్రాహ్మణు లుందురు. వారిముందు నేనెట్లు నడతును? నేను బండెక్కగా చూచి, అందరును 'ఇతడే రాజుగారి బావమరది' అని చెప్పికొనవలెను' అని బండెక్కుటకే నిశ్చయించెను. అప్పుడిక తప్పదని విటుడు 'వసంతసేన నిన్ను కోరి వచ్చిన'దని చెప్పెను. అతడు తనకంత అదృష్టము పట్టినదని వసంతసేన కాళ్లపై బడెను. తన్నిప్పటికైన వలచి రక్షింపుమని వేడుకొనెను. ఆమె కోపముతో అతనిని కాలితో త్రోసినది. దానితో నతని కవమానము కలిగినది. ఆమె కథను బండివానినడిగి, తెలిసికొని, 'ఓ దాసిదానా! చారుదత్తుని వద్దకుపోవు నిన్ను నా గిత్తలు మోయలేవు. దిగుమ' నెను. ఆమె తటపటాయించినది. శకారుడు ఇది సహింపలేక 'ఇంకను దిగవేమి? జటాయువు వాలి పెండ్లాము నీడ్చినట్లు జడ పట్టుకొని క్రిందపడలాగుదును' అనుటతో ఆమె వణకిపోయినది. విటుడామెను మెల్లగా క్రిందికి దిగుమనెను. ఆమెదిగినది.

శకారునకు వెనుకటి కోపమునకు ఇప్పటికాలితాపు బలమైనది. అతడు ప్రతీకారము చేయదలచి విటునితో 'నీవు కోరినంత డబ్బిచ్చెదను. వసంతసేనను చంపుము' నెను. అత డట్టి పాపకార్యము చేయుట కంగీకరించలేదు. అప్పుడు స్థావరకుని ఆ పనిచేయుటకు బ్రతిమాలెను. అతడును ఒప్పు కొనలేదు. 'ఒరీ! నామాట విననటరా? విననిచో తన్నెదను సుమీ' అనగా నతడు 'నీవు నా శరీరమునకు ప్రభువవుకాని శీలమునకు కాదు. నీకు తోచినట్లు చేయుము. అంతగా కోపించిన నీవు నన్ను కొట్టగలవేమో కాని నాచే అకార్య మును మాత్రము చేయింపలేవు' అనెను. శకారుడు కోప ముతో 'ఓరీ! ఆగర్భదాసుడా! వెంటనే పోరా!' అని తిట్టు టతో నతడు వసంతసేనను చూచి 'అమ్మా! నిన్నింతకంటె రక్షించలేను' అని వెళ్లిపోయెను. శకారుడు కండువా నడు మునకు బిగించుకొని వసంతసేనను కంఠము పిసికి చంప బోయెను. అప్పుడు విటుడు 'దుర్మార్గుడా! నా కన్నుల యెదుటనే ఈ అబలను చంపెదవురా!' అని శకారుని కంఠము పట్టుకొని నేలమీదికి విసరెను. అతడు మూర్ఛపోయి, అప్పుడే తెప్పరిల్లి, 'వీనికెంత బలమున్నది! వీడుండగా నా పని సాగనీయడు' అనుకొని, వానిని మోసగించుటకు నిశ్చ యించెను. ఆలోచించగా నాలోచించగా నతనికొక మంచి ఉపాయము తట్టినది. వెంటనే 'బావా! నేనుమాత్ర మీమెను చంపుదునా? ఏదో నాకు లొంగునని అట్లుచేసితిసుంతే' అని

తాను చేసిన పని సర్ది చెప్పి, అతనిని స్థావరకుని తీసికొని రమ్మని పంపెను.

విటుడు వెళ్లిపోవుచున్నానని నాలుగడుగులు వేసి, అంతలో నీ దురాత్ముడు ఏమిపాపము చేయునోయని చాటున దాగెను. శకారుడెంత తెలివితక్కువ వాడైనను ఇట్టి విషయమున అతని బుద్ధి పాదరసమువలె ప్రవహించును. వెళ్లి పోయిన విటుడు ఏ చాటుననైన దాగునేమో యని వానికి నమ్మిక కల్గించుటకై తాను నాలుగు పువ్వులు కోసి, ఆమె కొప్పులో పెట్టబోవుచు, పాదములపై బడి బ్రతిమాలెను. ఆమెను కామించిన శకారుడు ఇక చంపడని నిశ్చయించుకొని విటుడు వెళ్లిపోయెను. అతడు బ్రతిమాలినను ఆమె వినలేదు. అతడికి కోపము పట్టలేక గొర్రెపిల్లమీదకు తోడేలు పడినట్లు మీదపడి కంఠము నొక్కెను. ఆమె అతని దెబ్బ నెట్లోర్చుకొనగలదు? ఆ మొదటి దెబ్బకే తెలివితప్పి పడిపోయినది. శకారుడు ఆమె చచ్చిపోయిన దనుకొని, సంతోషముతో చంకలు వాయించుకొని విటున కెదురేగెను.

అంతలో విటుడు స్థావరకుని బ్రతిమాలి తీసికొని వచ్చుచు, శకారుడు వసంతసేన నేమిచేయునోయని మనస్సులో బాధపడుచునే యుండెను. ఇంతలో అతడే ఎదురైనాడు. విటుడు ఆదుర్దాగా 'వసంతసేన యేది?' అని అడుగగా శకారుడు 'అమూలకే పోయినది' అనెను. అతడు నమ్మక నిజము చెప్పుమని బలవంతపెట్టగా 'నీ నెత్తిమీద నా కాళ్లు పెట్టినట్లే. ఏమియు ననుకొనకుము. ఆమెను చంపివేసితినిలే'

అప్పుడు ఆ భిక్షువు ఆమెతో పాటు, ఆమె నింటివద్ద దిగబెట్టుటకై ఊరిలోనికి వచ్చెను.

శకారుడు చారుదత్తునిపై నేరము మోపదలచి న్యాయస్థానమున కేగెను. అప్పుడు న్యాయస్థానమున అధికారులు, శ్రేష్ఠి, కాయస్థుడు మున్నగు పంచాయితీ పెద్దలు సభతీర్చిరి. భటుడువచ్చి నేరముకలవారు వచ్చి చెప్పుకొనవచ్చుననగా శకారుడు వచ్చి తనదొక అభియోగమున్నదనెను. వారిదేదో లకలుకలుగా నుండునని 'ఇప్పుడు కాదు. రేపు మాత్రము'నిరి. వాడు మండిపడి 'రాజుగారి బావమరిదిని. నా అంతటివాడను నేనువచ్చి చెప్పుచుండగా విని తీర్పు చెప్పలేరా? చూడుడు! మీ ఉద్యోగము లేకుండునో?' అనుటతో వారు 'ఏడన్నంత చేసితీరును. వట్టి దురాత్ముడు. 'దుష్టం ఛందోనుసారేణ (దుష్టుని కిష్టమువచ్చినట్లు నడువవలె)' ననుకొని 'రాజబావా! నీదేముందు చూచెద' మనిరి. అతడు లోనికేగి 'నేనీ రోజున పుష్పకరండకోద్యానమునకు పోగా అక్కడ స్త్రీ శవమొకటి కన్పడినది దాని నెవరో మెడపిసికి చంపినారు. నేనుకాదు' అనుసరికి 'నేనుకాద'న్న మాటను వారు గుర్తుగా వ్రాసికొనిరి. ఎవడో వస్తువులకై చంపియుండును. మెడ వాచినది; నగలాలేవు' అని ఆమెను గుర్తించితివా? అన్నమాటకు 'ఆమె వసంతసేనయే. మన యూరిలో చాల ప్రసిద్ధిగన్న బోగపుపిల్ల' అనెను. వారట్లయిన ఆమెతల్లిని పిలిపించెదమని పిలిపించిరి.

ఆమె వచ్చినది. న్యాయాధిపతు లామెను 'నీకూతు రెచ్చటికి? ఎందుకు వెళ్లినది?' అని ప్రశ్నించిరి. ఆమె 'మిత్రుని యింటికేగినది. అయ్యా! మాకెందుకన్నది ప్రశ్న కాదు. యౌవన సుఖము లనుభవించుటకై వెళ్లివచ్చుచుండుము కదా! చారుదత్తుని యింటికేగినది' అన్నది. వెంటనే నానావ్యవహారములో చారుదత్తునకు జోక్యముండుట పరికించి, అతనిని పిల్చుటకు జంకి, అయినను తప్పదని పిలిపించిరి. చారుదత్తునకు శకునములు మంచివి కాలేదు. 'ఇదేమా? ఈరోజున నన్ను, నా గుణశీలము తెలిసియు న్యాయస్థానమునకు పిలిపించుచున్నారు. ఒకవేళ ఆర్యకునికి నేను సాయముచేసి వెళ్లించుట నెవ్వరైన చెప్పలేదుకదా!' అనుకొనుచు వచ్చెను. అతడు రాగానే మర్యాదగా అతనికి పీఠమునిచ్చి దానిపై కూర్చుండుమని 'అయ్యా! మీరు వసంతసేన నెరుగుదురా? ఆమెతో మీకు కల సంబంధ బాంధవ్యము లేమిటి?' అని ప్రశ్నించిరి. అతడు మొదట చెప్ప సిగ్గుపడినను వారి ప్రేరణచే వ్యవహారముకాన చెప్పెను. 'ఆమె యింటికి వెళ్లినదా?' అనిరి. దానికేమి చెప్పవలెనో అతనికి తోచలేదు. అసలు ప్రొద్దుననుంచి ఆమె విషయమే తనకు తెలియదాయె. ఏమని చెప్పును? అట్లు జవాబున కాలస్యమగుటకు వారనుమానించి 'చెప్పుమ'ని హెచ్చరించిరి. అతడు 'ఇంటికేగినది' అని చెప్పెను. శకారుడు 'ఓరీ! దుర్మార్గుడా! నగలపై లోభముచే జీర్ణోద్యానమున ఆమెను మెడపిసికి చంపి 'ఇంటికి వెళ్లినద'ని బొంకుటకు నీకు నోరెట్లు

నచ్చెరా?' అని బుకాయించెను. వసంతసేన తల్లి 'దాచ పెట్టిన నగ దొంగతెత్తుకొని పోయినందులకే తన రత్నావళి నిచ్చిన యితడు నగలకై నా కూతును చంపునా? పాపపు మాటలనకుము. ఎవడు చంపెనోకాని యితడై యుండడు' అని శకారునే నిందించినది. అధికరణికుడును నిందించెను. శకారుడు 'పక్షపాతము చేయకుడ'ని హెచ్చరించెను.

అంతలో వీరకుడు చందనకునిపై కోపముతో వచ్చి 'అయ్యా! నేను రాజాజ్ఞచే బండిచూచుచుండగా చందనకుడు చారుదత్తుని బండిని జీర్ణోద్యానమునకు పోవుచుండగా చూచి, నన్ను చూడనియ్యక, పైపెచ్చు రెండు తన్నులు తన్ని పంపెను. న్యాయము విచారించుడు' అనెను. అది యీ సందర్భములో చారుదత్తుని మాటలకు వ్యతిరేకముగా సరి పోయినది. శకారుడు 'ఓరీ చారుదత్తా! బండిపై జీర్ణోద్యాన మునకు తీసికొనిపోయి, చంపి, ఇంటికి వెళ్లినదంటివే?' అని హేళనచేసెను. అధికరణికుడు ఉద్యానములో స్త్రీ శవమే దైన నున్నదేమో చూచిరమ్మని వీరకునంపెను. అతడు వెళ్లి అంతక్రితమే చెట్టుకొమ్మ విరిగి చనిపోయిన స్త్రీ శవమొకటి నక్కలు లాగుచుండగా చూచివచ్చి 'ఉన్నద'ని చెప్పెను. శకారుడు ఇప్పటికైన నా మాటపై మీకు నమ్మకము కుదిరి నదా? ఇంకను ఆద్రోహిని క్రిందకూర్చుండు మనరేమి?' అనగా వారు చారుదత్తునిపై వృథాగా నేరము బరువగుచున్నదే? అనుకొనుచు అతని నేమియు అనలేకపోయిరి. అతడు తన

మరవస్థను చింతించుచు క్రింద కూర్చుండెను. శకారుడు తటాలున లేచి ఆ యాసనముపై తాను కూర్చుండెను.

అంతలో నగలమూటను తీసికొని విదూషకుడు అచ్చటికే వచ్చినాడు. వసంతసేన రోహసేనున కిచ్చిన నగలను రదనిక అతనికే అలంకరించి లోనికి తల్లి వద్దకు పంపగా ఆమె 'అరువు సొమ్ములు మన కెందుకు! పరుల ఆభరణములు పెట్టుకొనరాద'ని వాటి నామెకిచ్చి రమ్మని మైత్రేయునంపెను. అతడామె యింటికేగుచు చారుదత్తుడేలకో న్యాయస్థానమున కేగెనని తెలిసి చూచిపోదమని వచ్చెను. చారుదత్తునిచూచి 'యిదేమ'ని యడుగగా అతడు జరిగినదెల్ల చెప్పెను. మైత్రేయున కతనిపై ఎంతో కోపమువచ్చినది. 'ఓరీ లంజకొడుకా! రాజస్యాలకుడనని పొగరుబోతు తనమా? చిగురెక్కడ నలుగునో అని పూచిన మాధవీలతనైన చేతితో వంచని చారుదత్తుడు వలచిన స్త్రీని చేతులార చంపునా? నీవెట్టంటివిరా? చూడు నిన్నేమి చేయుదునో?' అని చేతిలోని వంకర కర్రతో కొట్టబోయెను. ఆ కంగారులో చంకలోని నగల మూట జారి క్రింద పడినది. అదిచూచి శకారుడు 'అవిగో నగలు! వీటికోసమే యితడా పాపమున కొడిగట్టినది!' అని కేకలువేసెను. చారుదత్తుడు ఒకదానిపైనొకటి వచ్చి, యిట్లు తనపై దోషము బలమగుచున్నందులకు విచారించగా మైత్రేయుడు 'నిజమేల చెప్పవయ్యా!' అనెను. అతడు 'మిత్రమా! రోజులు మంచివి కానప్పుడు మనమేమి చెప్పినను అధికారు

లకు వినిపించదు. అది కాలమహిమ' అనెను. శ్రేష్ఠి ఆ నగలను వసంతసేన తల్లికిచూపి 'వీటి నానవాలు పట్టగలవా? అని అడిగెను. ఆమె 'నేను సరిగా ఆనవాలు పట్టలేను. కన్ను చెదరుచున్నది. మానగలు చేసినతడే ఇవియు చేసియుండును. అందుచే ఒక్కరీతిగా కన్పడుచున్నవి' అన్నది. 'ఇవినీవా?' అని చారుదత్తు నడుగగా అతడు 'ఇవి నావికావు. వసంతసేనవే' అనెను. అధికరణికుడు 'నిజము చెప్పు'మనగా చారుదత్తుడు 'అయ్యా! నా మనవి యొక్కటే. నే నేపాపము నెరుగనివాడను. మీకు 'నేను పాపినని తోచిన అట్లే కానిండు' అని వసంతసేనలేని బ్రతుకు నిరర్థకమనుకొని 'ఇహపరము లెరుగక యొక కామినీమణిని చంపుట కొడిగట్టితినన్న అతడే ఆ మిగత వృత్తాంతముచెప్పును' అనెను. శకారుడు సంతోషముతో 'చూచితిరా? ఇతడే మీకు సంశయము తొలగించెకదా! ఈ దరిద్రుని కొసతవేసి చంపుడు' అనెను. న్యాయాధిపతులును అట్లే తీర్పుచెప్పిరి.

వెంటనే రాజపురుషులు వచ్చి అతనిని పట్టుకొనిరి. అప్పుడు వసంతసేన తల్లి 'అయ్యా! నా కూతురు పోనేపోయినది. ఇతనినైన బ్రతుకనిండు. మా వివాదమున తీర్పు మా యిష్టము వచ్చినట్లుండవలె గదా! నేను వదలుమన్నప్పుడు మీకేల అభ్యంతరము'న్నది. శకారుడు 'ఛీ ముసలిముండా! నీ కేంపనిలే. పో' అని గద్దించి దానిని వెళ్లగొట్టెను. న్యాయాధికారి 'బ్రాహ్మణుడే హంతకుడైనచో దేశము నుండి వెడలగొట్టుమని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. అయి

నను రాజుగారేమందురో చెప్పిరమ్మని భటుని పంపెను. అతఁడు వెళ్లి ఆ విషయమును విన్నవించుటతో పాలక మహా రాజు 'ద్రవ్యాశచే స్త్రీని చంపిన పాపిని, ఆ నగలమూటను మెడకుకట్టి, చాటించుచు ఊరేగించి. దక్షిణ శ్మశానమునకు తీసికొనిపోయి కొరుతవేసి చంపుడు. మరెవ్వరైన నిట్టి అకా ర్యము చేసినచో ఇదే శిక్షయని తెలియవలెను' అని ఆజ్ఞ నిచ్చెను. ఆ యాజ్ఞను వచ్చి, భటుడు చెప్పగానే చారు దత్తుఁడు 'రాజింత అనాలోచితముగా చేయుచున్నాడే? ఇంత కును తన కర్మమట్లున్నద'నుకొని మైత్రేయునితో మిత్రమా! నా తల్లికి నా ఆఖరి నమస్కారమును తెల్పుము. రోహ సేనుని మాత్ర మొక్కసారి కడసారిగా చూపుము' అనెను. అతఁడు కన్నుల నీరు నింపుకొని 'మిత్రమా! నీవు చనిపోయిన తర్వాత ఈ నీ మిత్రుడింక ఉండునా?'అనుచు వెళ్లిపోయెను. అధికారుల ఆజ్ఞచే చండాలురు వచ్చి చారుదత్తుని పట్టు కొనిరి. అతఁడు నిర్దోషినైన తన్ను పట్టుకొని చంపగడంగిరే. రాజే, న్యాయస్థానమే యిట్లు గ్రుడ్డిదై, చెవిటిదై యున్న, నిక ఎవ్వని ననవలె? తానెట్టి అగ్నిపరీక్షకైన నాగెడివాడే కదా! వీసమెత్తైనను దోషమెరుగడే. శత్రువు చెప్పినమాట లపై ఆధారపడి ఇంతచేయుట న్యాయమా? అనుకొని తన పురాకృతమిట్లున్న దనుకొని తలవంచుకొని యూరకుండెను.

చండాలురు వచ్చి చారుదత్తునకు నొంటినిండ ఎర్ర చందనములో ముంచిన చేతులతో ముద్రలువేసి, ఆపైన పిండిచల్లినారు. మెడలో గన్నేరు పూలదండ వేసినారు.

అది వధ్యచిహ్నము. చండాలురిద్దరు చెరియొక వైపున నుండి అతనిని తీసికొని వెళ్లుచుండిరి. ఇన్నాళ్లవరకు గొప్పకీర్తిని పొంది, మచ్చున కొక్కమచ్చయైన లేని చారుదత్తునకేనాడు ఇట్టి చెప్పరాని దురవస్థ వచ్చినందుకు చూచెడి ప్రజలెల్లరు ఇక మనుజులమై పుట్టకూడదని విచారించుచు, కన్నుల నీరు నింపుకొనుచు, 'సుఖముగా స్వర్గమున కేగుము'ని చారుదత్తుని దీవించుచుండిరి. చండాలురు డప్పువాయించుచు, 'భ్రష్టుడైపోయెడి రాజును, జారెడి నక్షత్రమును, కోడలు పుట్టుకను, సజ్జనుల మరణమును చూడరాదందురు. కాన దూరముగా తొలగుడు' అనుచు కేకలు వేయుచు వెళ్లుచుండిరి. అప్పుడు ఉత్పాత సూచకముగా పిడుగులు పడెను; నక్క కూతలు వినిపించెను. వారు రాజాజ్ఞప్రకారము నాలుగు వీధుల మొగలో డప్పువాయించి, 'సొమ్ములకై స్త్రీని చంపిన వానిగతి యింతే' అని కేకవేసిరి. చారుదత్తుడది వినలేక చెవులు మూసికొని 'యజ్ఞములలో వేదఘోషలో వన్నెకెక్కిన కులమున పుట్టిన నాకు ఈ అంత్యదశలో నా పాపకర్మము కొలది ఇట్టి చాటింపు వినవలసివచ్చినది' అనుకొని 'ఓ వసంతసేనా! నీ అధరామృత పానముచేసి మత్తెక్కుదుననుకొంటినిగాని ఇట్టి అపకీర్తి యనెడి విషమును త్రాగుదునని కలలోనైన అనుకొనలేదు' అని విచారించెను. అప్పుడతనిని చూచిన మిత్రులు అతని ముఖముకేసి చూడలేక మొగముమీద గుడ్డకప్పుకొని దూరముగా మరలిపోవుచుండిరి. వారినిచూచి అతడు 'ధనము ఉన్నప్పుడే మిత్రులు

గాని ఇట్టి కష్టదశలో ఎవరు ఎవరికినికారు' అనుకొని విచారించెను.

ఇంతలో మైత్రేయుడు రోహసేనుని తీసికొనివచ్చెను. అతనిమాట విని చారుదత్తుడు కడసారిగా తన కుమారుని ముఖమును చూడనిమ్మని చండాలుని కోరెను. అతడంగీకరించెను. మైత్రేయుడు బాలు నతనిదగ్గరగా తీసికొనివచ్చెను. ఆ బాలుని ముఖము చూచుటతో తనకు పరలోకమున ఆకలి దప్పులుండకుండ నీరు, పిండమును ఈయవలసిన వాడితడే యని ఎంతో విచారించెను. అతనికిచ్చుటకు తనవద్ద నేమియు లేనందున మెడలోని జందెమును తీసి యిచ్చెను. అప్పుడు చండాలుడు 'ఓరీ! చారుదత్తా! ఇకరారా!' అని గద్దించెను. అది విని రెండవవాడు 'ఓరీ! ఆపత్తు వచ్చినంత మాత్రాన ఆర్య చారుదత్తు నిట్లు పిలుతువటరా? ఏదో అపవాదు వచ్చినంత మాత్రాన ఇతని గౌరవము పోవునా? గ్రహణ సమయమున రాహువు మింగినను చంద్రుని జనులు పూజింపరా?' అని మందలించెను.

రోహసేనుడు వచ్చి, తండ్రిని చంపుటకు తీసికొని వెళ్లుచున్నారని తెలిసికొని, తండ్రికి బదులు తన్ను చంపుమని కోరెను. చండాలురు అది రాజాజ్ఞ కాదనగా చారుదత్తుడు కొడుకును కౌగిలించుకొని, బ్రహ్మానంద పరవశుడయ్యెను. మైత్రేయుడు తన్ను చంపి, తన మిత్రుని వదలుమని చండాలుని బ్రతిమాలుకొనెను. అంతలో మరొక

నాలుగు వీథులమొగ రాగా అచ్చట మరల చండాలురు చాటింపు వేసిరి.

అది విన్నాడు మేడమీద సంకెలలు వేసియున్న స్థావరకుడు. శకారుడు న్యాయస్థానము నుండి రాగానే తాను పన్నిన కుతంత్రము బయటపడునేమో యను భయముతో స్థావరకుని కాలికి సంకెలలు వేసి మేడపై నుంచెను. అతనికి చారుదత్తున కట్టి శిక్షపడుట ఇష్టములేదు. అందుచే అతడు చారుదత్తుడు దోషి కాడని కేకలు వేసెను. అతని కేకలు ఆ డప్పులమోతలో ఎవరికిని వినపడలేదు. అందుచే నతడు, చచ్చినను సరేయని ధైర్యముచేసి అమాంతముగా క్రిందికి దుమికెను. భగవంతు డతనిని కరుణించినాడు. అతనికి దెబ్బ తగులకుండుటయే గాక కాలి సంకెలలుకూడ తెగిపోయినవి. అతడు పరుగు పరుగున వచ్చి, చండాలురతో జరిగిన నిజ మంతయు చెప్పెను. అది వినుటకు చాలమంది జనులు గుమి గూడిరి. శకారుడు తన శత్రువైన చారుదత్తుని వధ్యస్థానమునకు తీసికొని వెళ్ళుచుండగా కన్నులార చూడవలచి, మేడ నెక్కెను. తీర చూడగా అక్కడ స్థావరకుడు కనుపించెను. అతనిని చూచుటతో శకారునకు గుండెలాగిపోయినవి. మరల ఏ యెత్తు పన్నవలెను అని చరచర దిగివచ్చి, స్థావరకుని లోనికిరమ్మని లాగెను. అతడు తిట్టుచు 'ఓరీ దురాత్ముడా! ఆమెనే గాక చారుదత్తునికూడ చంపదలచితివటరా?' అనెను. అందుకు శకారుడు 'జనులారా! వినుడు. వీడు నా యింటిలో దాసుడు. బంగారము దొంగిలించెనని ఇప్పుడే వీనిని మొత్తగా

తన్ను సంకెలలువేసి వచ్చితిని. ఆ కోపముతో నితడిట్లు చెప్పుచున్నాడు' అని చాటుగా స్థావరకునితో 'నీవీ బంగారము పుచ్చుకొని నా పక్షము నెగ్గించుమ'ని చేతిలో పెట్టెను. అతడది తీసికొని 'ఇదిగో చూచితిరా? ఇతడిది నాకు లంచమిచ్చి, అబద్ధమాడు మనుచున్నాడు' అని బంగారమును చూపగా, శకారుడు 'అదే యితడు దొంగిలించిన బంగారము' అని గద్దించెను. డబ్బుకలవాడు, రాజుగారి బావమరది అని అందరును శకారుని మాటనే నమ్మిరి కాని స్థావరకుని మాట ఒక్కరును నమ్మలేదు. అప్పుడతడు విచారముతో 'చారుదత్తా! నేనింతకంటె యేమి చేయగలను? పాడు ప్రజలు నిజము చెప్పినను నమ్మరు' అని వెళ్లిపోయెను.

శకారుడు చారుదత్తుని త్వరగా చంపుడని చండాలురను తొందరచేసెను. వారు చారుదత్తుని నిజము చెప్పుమనిరి. అతడు 'నన్ను చంపగలరేకాని నాచే అసత్యము మాత్రము చెప్పించలేరు' అనెను. చండాలురప్పుడు ఆనాడు చంపుట యెవరి వంతోయని చూచుకొనిరి. చారుదత్తుని వధ్యశిలపై కూర్చుండుమనిరి. చంపబోవు చండాలుడు ఒక్క క్షణమాగెను. రెండవ వాడిదేమనగా 'నా తండ్రి చనిపోవునప్పుడు 'ఓరీ వీరకా! నీవంతు చంపవలసి వచ్చినప్పుడు ఒక్క క్షణమాగుము. ఆ క్షణములో రాజునకు కొడుకుపుట్టిగాని, ఏనుగు త్రెంపుకొనిగాని, రాజుమారిపోయిగాని వధ్యుడు వదలబడ వచ్చును' అని చెప్పెను. అందుచే ఆలస్యము చేసితిని' అనెను.

ఇంతలో భిక్షువు వసంతసేనను ఇంటివద్ద దిగబెట్టుటకై వచ్చుచుండెను. వారు వీధిలో జనులు గుమిగూడుట చూచిరి. అదేమిటని తెలిసికొనగా చారుదత్తుని వసంతసేనను చంపిన దోషమునకై చంపుచున్నారని తెలిసినది. ఆ మాట వసంతసేన చెవులకు పిడుగుపాటైనది. ఆమె 'నేను బ్రతికి యుండగనే నన్ను చంపిన నేరమా!' అని వలవల యేడ్చుచు, పరుగెత్తుకొని వధ్యస్థానమును చేరెను. ఇంతలో చండాలుడు చారుదత్తుని నరుకుటకై ఒరనుండి కత్తిలాగెను. దాని పిడి యూడి చేతిలోనికి వచ్చినది. రెండవసారి మరల చంపబోగా 'వలదు వలద'న్న వసంతసేన కేకలు వినిపించినవి. ఆమె చారుదత్తుడింకను నరుకబడనందులకు ఎంతో సంతోషముతో ఒక్క పరుగులో నతనివద్దకు వచ్చినది. ఆమెను చూచుటతో శకారునకు పైప్రాణములు పైనపోయినవి. 'ఈ దాసి ముండ ఇంకను బ్రతికియే యున్నది. ఇంక నా ప్రాణములకు నీటిచుక్క వదలుకొన వలసినదే' అని భయముతో పారిపోయెను. చండాలు రదిచూచి, 'వసంతసేనను చూచుటతో భయపడి పారిపోవుచున్నాడు. కావున నితనినే పట్టుకొండ' మని శకారునివెంట పరుగెత్తిరి. చారుదత్తుడు పునర్జన్మమెత్తినట్లు సంతోషించెను. తనకు ప్రాణదానము చేసెనని వసంతసేనను పొగడెను. ఆమె 'ఆర్యపుత్రా! నన్ను పొగడకుము. నీకు ఇంత దురవస్థ నా మూలానకదా వచ్చినది' అని కాళ్లపైబడి యేడ్చుచుండెను. చారుదత్తుడు తనకు చేసిన వధ్యాలంకరణమే వివాహాలంకారములుగాను, శ్మశా

నమే కల్యాణ వేదికగాను, దప్పుల మ్రోతలే మంగళవాద్యములుగాను అనుకొనెను. వసంతసేన 'ఈ నేరమేమిటి స్వామి?'ని అడుగగా నతడు జరిగినదెల్ల చెప్పి, 'ఈ భిక్షువు నన్ను బ్రతికించెన'నెను. చారుదత్తుడతనికి కృతజ్ఞత చూపబోగా ఆ సన్న్యాసి 'అయ్యా! నన్ను గుర్తించలేదా? నేను మీ పాద సేవకుడనగు సంవాహకుడను' అని అతనికి నమస్కరించెను.

అట్లు వారట్లుండగా ఆర్యకుడు శర్విలకునితో కలసి పాలక మహారాజును చంపివేసెను. వెంటనే ఆర్యకుడే రాజుగా ప్రజలందరు ఆమోదించిరి. అతడు రాజ్యము వచ్చిన మొదటి నిమిషములో చారుదత్తుని ప్రాణరక్షణ చేయుమనియు, అతనికి వేణానదీ తీరములోని కుశావతీ రాజ్యమిచ్చితినని యు చెప్పుమని శర్విలకుని పంపెను. అతడు వధ్యస్థానమునకు పరుగున వచ్చి, చారుదత్తునకు నమస్కరించెను. చారుదత్తుడు 'నీవెవరవ'ని అడుగగా 'మీ యింటిలో వసంతసేన దాచిన నగలను దొంగిలించిన దొంగను, రక్షింపుము' అనెను. చారుదత్తుడు అతనిని కౌగిలించుకొని సమ్మానించెను. అప్పుడు శర్విలకుడు 'నీ బండినెక్కి ప్రాణములు రక్షించుకొన్నందులకు బదులుగా ఆర్యకుడు రాజై, ఈ క్షణములో నీకు కుశావతీ రాజ్యము నర్పించుచున్నాడు. కాదనక మన్నించి పుచ్చుకొనుడు' అని ప్రాధేయపడెను. అంతలో చండాలురు శకారుని కట్టితెచ్చిరి. అతడా సమయమున తనకు ప్రాణములు నిల్పుకొనుటకు గతిలేదని రక్షింపుమని చారుదత్తుని కాళ్లపై బడెను. అతడు తనకు చేసిన అపకారము నంతను మన్నించి,

అభయమిచ్చెను. శర్విలకుడు శకారునకు తగినశిక్ష విధింపుమని చారుదత్తునికోరెను. శకారుడు కత్తివాటుకు నెత్తురుచుక్కలేని మొగముతో చారుదత్తుడేమి ఆజ్ఞాపించునో అని భయముతో 'అయ్యా! శరణంటిని. కాపాడుము. ఇకనెప్పుడును నిన్ను చంపను'అని కాళ్లుపట్టుకొనెను. వసంతసేన తన కసితీర చారుదత్తుని మెడలోని వధ్యమాలనుతీసి, శకారుని మెడలో వేసెను. శర్విలకుడు అతనికి తగినశిక్ష యేదియో విధింపుమని తొందరపెట్టెను. చారుదత్తుడు 'ఇతనికి తగినశిక్ష'అనుటతో మధ్యలో నందుకొని శర్విలకుడు 'ముక్కముక్కలుగా చిత్రవధచేసి కాకులకు గ్రద్దలకు ఎగురవేయుదువా?'అనెను. చారుదత్తుడు చిరునవ్వు నవ్వుచు 'వలదు. వలదు. అంతకంటె పెద్దశిక్షయే వేయవలెను. వెంటనే వదలివేయుడు. దానితో నిక నతడు తల ఎత్తుకొనలేక పోవును' అనెను. అది విని 'బ్రతుకు జీవుడా'అని శకారుడు తల తడవుకొనుచు వెళ్లిపోయెను.

ధూతాదేవి 'మగని మరణవార్త వినకముందే చచ్చిపోవుదున'ని చితిపేర్చుకొని దూకబోవుచున్నది. రోహసేనుడు తానే ముందు దూకుదుననెను. మైత్రేయుడు ముందు తాననెను. ఆ కుటుంబమునకు ఉవ్వెత్తుగా వచ్చిన ఈ సంఘమరణమునకు చూచెడి ప్రజలెల్లరు ఏడ్చుచుండిరి. అది చూచి చందనకుడు చారుదత్తునివద్దకు పరుగెత్తుకొని వచ్చి 'ఆర్యా! నీ భార్య నిప్పులలో దూకబోవు చున్నది. ఎవరు చెప్పినను వినుటలేదు. వెళ్లి రక్షింపుమ'ని కేకలు వేసెను. అతడు త్వరత్వరగా నడచుచు, వారగ్ని ప్రవేశము చేయు

చోటికి చేరెను. అప్పుడే ధూతాదేవి మైత్రేయునితో 'నీవుండుము. లేకున్న నా బాలుని రక్షించు వారెవరు?' అనుచుండగా చారుదత్తుడు 'నేను రక్షింతును' అనుచు చరచర వచ్చి బాలకు నెత్తుకొనెను. ఆమె మగని చూచుచు, సంతోషాతిశయముతో తన కన్నులను తానే నమ్మలేకపోయినది. మైత్రేయుడు మిత్రుడు బ్రతికివచ్చెనని కౌగిలించుకొనెను. రదనిక వచ్చి, అతని కాళ్లపై బడినది. వసంతసేనను చారుదత్తుని భార్యగా పరిగణించుమని ఆర్యకుడు ఆజ్ఞాపించి, ఆమెకు తగిన అలంకారములు పంపెను. వాటినామె అలంకరించుకొన్నది. అన్నిటికన్న ముందుగా మేలిముసుగు వైచికొన్నది. రాజు ఆమెను రక్షించిన బౌద్ధభిక్షువునకు బౌద్ధవిహారములన్నింటిమీద కులపతి పదవినిచ్చెను. చారుదత్తుడు స్థావరకునకు దాస్యవిముక్తి చేసెను; చండాలురను వారి కులపెద్దల చేసెను; చందనకునకు సర్వసైన్యాధ్యక్ష పదవి నిచ్చెను; శకారునకు మామూలు మర్యాదలు ఉండునట్లు చేసెను.

ఈ రీతిగా భగవత్కృపవలన అందరును సజీవులై కలిసికొనిరి. చారుదత్తుడు వసంతసేనను భార్యతో సమముగా స్వీకరించి మన్నించెను. అతని మంచిగుణములే అతనికీ సుఖములన్నిటిని చేకూర్చినవి. విధివిలాసమువలన ఇన్ని తారుమారు లయ్యెనని చారుదత్తు డొక్క చిరునవ్వు నవ్వెను.

---

ఇది శూద్రక మహాకవి విరచితమైన మృచ్ఛకటికమను సంస్కృత ప్రకరణమునకు ఆంధ్ర వచన కథారచన.

---

# బాల సాహిత్యము

విజయ విలాసము
ప్రభావతీ ప్రద్యుమ్నము
హంస విలాసము
విప్రనారాయణ చరిత్ర
నీలాసుందరీ పరిణయము
పారిజాతాపహరణము
పాండురంగ మాహాత్మ్యము
వీరభద్ర విజయము
వసుచరిత్ర
కాశీ ఖండము
భీమఖండము
ఆముక్తమాల్యద
వేణీ సంహారము
శంకరాచార్య కథలు
కాదంబరి కథ 1, 2 భా.
కమల కథ
విచిత్ర కథలు
మాలతీ మాధవము
వినోద కథలు
జైమిని భారతము
ధర్మదేవత
స్వప్నవాసవదత్తము
ప్రియదర్శిక
పైవి ఒక్కొక్కటి రు. 0-10-0
అశోకుడు
కనిష్కుడు
మనుచరిత్ర

ఉత్తర రామాయణము 1,2 భా.
చంద్రభాను చరిత్ర
బాల దర్శిని
అపగండి చెబుతాను 1, 2 భా.
పిల్లల నాటికలు 1, 2 భా.
తమాషా కథలు
జలసింహ
హర్షవర్ధనుడు
పైవి ఒక్కొక్కటి రు 0-12-0
నాగానందము
దశకుమార చరిత్ర
చిరంజీవి
జానపద కథలు 1 to 4 భా.
నీతిసుధ 1 to 3 భా.
వీరసింహ
రాజసింహ
అజాత శత్రువు
పైవి ఒక్కొక్కటి రు 0-8-0
కళా పూర్ణోదయం 1-0-0
భోజరాజీయము 1-0-0
విక్రమార్క చరిత్ర 1-0-0
కులాసా కుటుంబము 1-0-0
మన పండుగలు 1-4-0
స్నేహఫలము 1-4-0
పేదరాశిపెద్దమ్మ కథలు 1,2,3 భా.
ఒక్కొక్కటి రు 1-0-0
ఈసప్ కథలు 1-8-0